


ఆధునిక సాహిత్య వేదిక

[ త్రైమాసిక ]

నవంబర్ 1968

# భారతీయ సాహిత్య పరామర్శ

సంపాదకుడు

వరవరరావు

నిర్వాహణ

'సాహితీ మిత్రులు'

ముఖచిత్రం: బెజవాడ దగ్గర కృష్ణ

చిత్రకారుడు: ఎస్. వి. రామారావు

ముద్రణ: శ్రీ ఎం. ఎస్. రావు
(శేషాచలం & కంపెనీ అధినేత) పర్యవేక్షణలో

సృజన చిరునామాలో మార్పు గమనించండి
ఇకనుంచి ప్రతులకు, ప్రత్యుత్తరాలకు
వరవరరావు,
చందా కాంతయ్య మెమోరియల్ కాలెజ్,
వరంగల్-2. (ఆం. ప్ర.) కు రాయండి.

ఈ సంచిక రూపాయిన్నర

సంవత్సర చందా నాలుగు రూపాయలు

printed, published and edited by
varavararao for 'sahithee mithrulu'

కవితలు:



వ్యాసాలు:



సమీక్షలు:

# మరువపు పువ్వులు.

సృజన నాలుగవ జన్మదినం నుంచి అయినా ద్వైమాస పత్రికగా మారాలన్న ఆకాంక్షతో మూడవ జన్మదిన సంచిక వెలువడుతున్నది

ఈ సంచికలో తన సత్తాను మించిన సీమల్లోకి సృజన తొంగిచూసే ప్రయత్నం చేసింది. ఆధునిక సాహిత్యవేదికగా మాత్రమే అవతరించిన పత్రిక ఆధునిక అరూప కళాప్రపంచంలోని కుంచెతో కొంచెం పరిచయంచేసుకోవాలనే ప్రయత్నం, ఆధునిక తెలుగు సాహిత్యానికే అంకితమయిన పత్రిక అన్ని భారతీయ భాషల్లోని సాహిత్య ధోరణులను కనిపెట్టాలనే ప్రయత్నం, ప్రయత్నం మాత్రమే:- ఇందులో కనిపిస్తుంది.

ఈ ప్రయత్నంలో మాకు సూచనలు, సలహాలు, సహకారమూ అందించినవారు అనేకులు. వారందరికీ పేరుపేరునా ధన్యవాదాలు తన చిత్రాన్ని సృజనకు బహూకరించిన ఎస్. వి రామారావుగారికి, ఆ చిత్రాన్ని ఈ సంచికకు ముఖచిత్రంగా వేయాలని సూచించిన శ్రీపతిగారికి, కవర్ డిజైన్ వేసి, కళాకారునిపై ప్రత్యేకవ్యాసంరాసిన చలసాని ప్రసాదరావుగారికి, ముఖచిత్రం యింత అందంగా ముద్రింపించియిచ్చిన ఎమ్. ఎన్. రావు (శేషాచలం అండ్ కంపెనీ) గారికి మా ధన్యవాదాలు.

భాషారాష్ట్రాలు ఏర్పడిన నవంబర్‌లో భారతీయ సాహిత్య సంచికగా సృజన జన్మదిన సంచిక వెలువడడం సముచితంగా వుంటుందని సూచించినవారు నిర్మలానంద గారు. ఆ యా రచనలను సంపాదించడంలో, అనువదించడంలో, ఈ సంచికకు ఈ రూపం రావడంలో ఆయనకృషి అనల్పం. ఆయనతోపాటు ఈ సంచికలోని రచనలను అనువదించినవారందరికీ మా ధన్యవాదాలు. ఈ అనువాదాల విషయంలో అజ్ఞాతంగా మాకు సహకరించిన దేవులపల్లి సుదర్శనరావు, వేనరెడ్డి, పింగళి రంగారావు గారలకుధన్యవాదాలు.

అయితే గత సంచికలో ప్రకటించినట్లుగా భారతీయ యువతరంపై ప్రత్యేక దృష్టితోకాక భారతీయ సాహిత్య సంచికగా మాత్రమే యిది వెలువడుతున్నది. రచయితల, పాఠకుల అభిమాన ప్రోత్సాహ సహకారాలతో సృజన ఆధునిక సాహిత్య వేదికగా చిరస్థాయికావాలని ఆశించే,

—సాహితీ మిత్రులు.

మైథిలీ కవిత :

# యువతరం తిరుగుబాటు

మాయానంద్ మిశ్ర

మేమంతా ఎవరి సమాధుల్లో వాళ్లం పడి ఉన్నాం
గొంతుదాకా కూరుకు పోయి
అంగాలన్నీ కుళ్లి కంపు కొడుతూ
మేమంతా ఎవరి సమాధుల్లో వాళ్లం పడి ఉన్నాం
భూమిని పట్టి పీల్చే జలగల్ని కనిపెట్టలేక పోతున్నాం
ఆకాశం నుంచి వచ్చే గద్దల్ని పడగొట్టలేక పోతున్నాం
రావణుని ఛల ఛద్మం
కౌరవుల లిప్స
చేతకావు మాకు
ఇడిపస్ భ్రమనించి విముక్తిని ఊహించుకోలేం
అందుకే
మేమంతా ఎవరి సమాధుల్లో వాళ్లం పడి ఉన్నాం
మా తండ్రి ఛల ఛద్మం నుంచి
లిప్సా, భ్రమల్నించి
పుట్టుక వచ్చాడు
అతనెప్పుడూ సత్యానికి తండ్రి కాజాలడు
అందుకే
మేమంతా ఎవరి సమాధుల్లో వాళ్లం పడి ఉన్నాం
మా తండ్రి చనిపోయే మార్గం కోసం అన్వేషిస్తున్నాం
ఆయన మరణించాక
ఆయన చేతి కర్రి తీసుకొని
సమాధుల్ని విడిచి పైకి వస్తాం

అప్పుడు
కౌరవులతో యుద్ధానికి తలపడతాం
జలగని నాశనం చేస్తాం
రా బందుని పడ గొడతాం
అందాకా
మేమంతా ఎవరి సమాధుల్లో వాళ్లం నిద్ర పోతూంటాం.

మలయాళీ కవిత :

## మనిషి పుట్టలేదు

టి. వి. గోపాలకృష్ణన్

నడివీధి
వెన్నుని అంటుక పోయిన పొట్ట
విరిగి ముక్కలయిన మురళి
చేత పుచ్చుకొని-
పాపం! కృష్ణుడు
మోగించేందుకు
విఫల ప్రయత్నం చేస్తున్నాడు.
చుట్టూ గుమిగూడారు
అడుక్కుతినే పిల్లకాయలు-
లయ తప్పిన తరంగాలు
మురళి నుంచి వెలువడుతున్నాయి-

కాళ్ళ దగ్గర కుట్లుతెగి,
చెల్లా చెదరుగా పడివున్నది గీత!
అక్షరాల్ని మింగుతో జ్ఞానంలేని పురుగులు.
కొట్టవచ్చినట్టు పైకి ఉబికిన పొట్ట
ఇద్దరు బాబు-

కృష్ణుని ముందు పరచివున్న
గుడ్డలోకి రాగిడబ్బు విసిరి
ముందుకి సాగి పోయాడు-
రోడ్డుమీద ప్రవహిస్తోంది జీవితం.
పురాతినవ్వ-
ఆటవిక అమ్ముల మొలికి గుచ్చుకొంటున్న
అనుభూతి కృష్ణునికి.
నవయుగపు పూజాపేదిక
దివ్య సిద్ధుల హననానికి హేతువు?
కమల నయనుని కళ్ళు నిండినయ్
కవోష్ణ బిందువులతో-
అయినా-
దేవాలయ ప్రాంగణంనించి
'హరేకృష్ణ' అవే నామ సంకీర్తనం
తేలివస్తోంది గాలిలో-
వ్యధతో నిండిన కళ్ళు
పైకెత్తి చూశాడు కృష్ణుడు
మెర్క్యూరీ తీగెలా సాగిపోతున్న మోటారు కారులో
సాగిపోయే కుబేరుని కదలికల్ని
తిలకించ సాగాడు కృష్ణుడు-
ఆ పోతున్నది పాత మిత్రుడు కుచేలుడేమో!
అరచేత పుస్తకాల దొంతర్ల భారంతో
గోపికలు రోడ్డుమీద సాగిపోతున్నారు
మెల్లగా.... మెల్ల మెల్లగా.
అర్జునుడు రోడ్డు ప్రక్క చేరి
హస్త సాముద్రికం చూస్తున్నాడు
బరువు నిండిన చేతిబండిని
ఈడుస్తో వస్తున్నాడు జీసస్ క్రైస్తు.
అతని వెనుక-
పెద్ద అంగరకా, చేత 'క్రాస్' తో
మందగమనంతో 'అన్నాస్'-వస్తున్నాడు.

ముందుకి తోసుకవచ్చి-
చేతిలో తెరచి వున్న బైబిలుతో
'జూడాస్' హెచ్చరిక చేస్తున్నాడు జనాన్ని:
"తోవ యివ్వండి
క్రీస్తు వస్తున్నాడు."
ఎన్ని వైరుధ్యాలు?
ఎన్ని విపర్యాసాలు?
కృష్ణుని హృదయం బాధతో మూలిగింది-
రోడ్డుమీద జనం గుమిగూడటానికి
కారణభూతుడైన కృష్ణుని
దూరంగా తరిమి వేసింది ఎర్రటోపీ.
పగటి వెలుతురులో-
చేతిలో హరికేను లాంతరుతో-
ఓ పిచ్చివాడు నడిచివస్తున్నాడు
ఎదురుగా కృష్ణునికి.
అతను దగ్గరిగావచ్చి-
"నేను డియోజనీస్‌ని.
ఏథెన్సు నించి వెతెంచాను"
అన్నాడు-
పాపం! ముసలివాడు-
వక్రించిన జాతకంవల్ల పిచ్చివాడయినట్టున్నాడు!
వత్తిని మరికొంచెం పెద్దదిచేసి,
చుట్టూరా కలియజూచి,
బద్ధకంగా సాగిపోతో
అంటున్నాడు ముసలివాడు:
"మనిషి పుట్టనే లేదు"

(అను: నిర్మలానంద)

సింధీ కవిత :

# సరికొత్తసంస్కృతికి శ్రీకారంచుడతాం

శ్రీ హరీశ్ వాస్వాణీ

సుఖాల శిలువ మీద
సంస్కారపు పవిత్రతని
వేలాడేసి
నొసటని
తిరస్కారపు మరమేకుని
దిగ
వేశాం-
శరీరంలోని రక్తం
కడంటా
బొట్లు బొట్లుగా పడుతున్నంత సేపూ

శరీరం
యావత్తూ
గిజ గిజమని గింజు కొంటున్నంత సేపూ
మాలోని మృగరాజు
పొందే ఆమందానందం
మరి చెప్పనలవిగానిది-
పవిత్ర ఆత్మ ఎగిరి-
పోయేక-
పవిత్ర శరీరం మంచు గడ్డగా మారి-
పోయేక-

మా హృదయాలు మూలిగేను
అతనంటే జాలితో-
అతని అమాయికపు రక్తంతో
తడసిన సుఖాల శిలువ
మా హృదయ మందిరంలో
పెరుగుతుంది దానికి విలువ.
ప్రతీకలు చేసి
మెడల్లో ఒక్కొ-టొక్కటి వేలాడేస్తాం
సరికొత్త సంస్కృతికి
శ్రీకారం చుడతాం.

(అను: తెలుగు దాసుడు)

ఒడియా కవిత:

## పక్షి

ప్రజనాథరథో

ఒక పక్షి
సుదూర దిగంతం నించి
ఎగిరివచ్చి
నా నలువేపుల
తిరగడం మొదలెట్టింది.
దాని
ఒక రెక్క మీద
తరంగిత సముద్రం
ఇంక
మరో రెక్క మీద
కదలని ఆకాశం;

దాని చుంచువున
ఓ ఎర్రని-
ఆపిల్ లా
వేలాడుతోంది - 'పృథివి'-
ఈ - మట్టి పృథివి.
అది దాని
అలసిన రెక్కలు రెండూ
ఆడించి ఆడించి
ఆహత కంఠంతో
నాతో అంది-
కొంచెం స్థలమియ్య గలవా?
అవును రవ్వంత స్థలం
రెండడుగులు మాత్రం
నిబ్బెరపోయిన నేత్రాలతో నేను
కొంచేపు
దాన్ని చూశాను
అనంతరం
భయంతో సంకోచంతో
వొణుకుతూన్న నా
అరచేయి
దాని వేపు చాచాను.
పక్షి ఇప్పుడు
నా అరచేతి చరియ మీద
విశ్రాంతి తీసుకుంటున్నది.

(అను: పురిపండా అప్పలస్వామి)

అస్సామీ కవిత :

# భగవదన్వేషణలో నల్లపిల్ల

నవకాంత బారువా

దేవుడు
నీగ్రో నాటకం నించి దిగి వచ్చాడు-
నోటిలో ఖరీదయిన చుట్టతో
నిద్ర కళ్ళతో గొణిగాడు :
"వెలుగు, వెలుగు"
గీచిన అగ్గిపుల్లతో భగ్గుమంది వసంతం
పూలూ, రక్తం, అడవి నిండిన ఆకుపచ్చ చీకటి-
కాలం చచ్చి పోయింది
మృత్యువును విలీనం చేసుకొనే నీలాకాశపు హాలా హలం
పసిడివన్నె సింహపు జూలు కుంకుమపూరంగు కోరికలు
మన ప్రియురాళ్ల నిగ నిగ లాడే నల్లని సాటిన్ చర్మం
మృత్యుముద్రిత నరాల్లో సూర్యుని బిడ్డలు
పూలూ, నెత్తురూ, యెండి మండే ఇసుక పర్రిలు
కొత్త సృష్టిని మోస్తున్న నిండు చూలాలు ఆఫ్రికా!
అక్కడ వీచే పెను తుఫాను వేగంతో
ఇక్కడ మా రెక్కలు రెప రెప కొట్టుకుంటున్నాయ్
వెలుగు — ఏది? .... ఎక్కడుంది వెలుగు ?
అయ్యో! చరిత్ర !!

(అను: ము. మల్లేశ్వరరావు)

భోజపురి కవిత :

# వరదవెల్లువలో నగరం

శ్రీ కామతా ప్రసాద్ ఓఝా 'దివ్య'

ఎండకి కరిగి పరుచుకున్న తారు,
చెమట,
పెట్రోల్ మీద సముద్రున జారుతో
పరుగు ఇడే నగరం.

అర్థాల వ్యర్థాన్వేషణలో
కాలపు శిలువ మీద
తిరుగవేసి వేలాడ గట్టిన
ఇంద్ర ధనుస్సు
నగరం-
అలసి, సొలసి నిద్ర గూకింది.

కర్ఫ్యూలా
అనివార్యంగా
తన ప్రవాహపు ధర్మాన్ని ఆపింది.

లుక లుక లాడే పురుగుల్ని
పురుగులు పట్టిన గుండెల్ని
వక్షంలో పదిలంగా
దాచుకొని
ముఖ పరిచయం కూడా లేక
ఆత్మల్ని విస్మరించిన
జన సందోహం.

వెలుగు చీకట్ల పడుగు పేకల మధ్య
తన కోరిల్నించి వెలువడుతున్న
గరళాన్ని
యాతనతో సహిస్తో,
గదుల వాల్లు గోడల మధ్య-
ముడిగిపోయి,
కుళ్ళు కంపు కొడుతో నాగరికత.

రాత్రి వరద వెల్లువలో
తలమునకలైవున్న నగరంలో
మనిషి వక్షస్థలం మధ్య
చప్పుడు గాకుండా
(ఎవరో)
పెద్ద మేకుని
బలంగా దిగేశారు.

(అను: నిర్మలానంద)

రెండు పంజాబీ కవితలు :

## మేధో వృక్షం

మీశా

గుబురుగా పెరిగిన వృక్షంలాంటి మస్తిష్కంలో
గబ్బిలాలులాగా విశ్వాసాలు కొన్ని
తల క్రిందులుగా వేళ్లాడు తున్నాయి-
అప్పుడప్పుడు రెక్కలు చప్పుడు చేస్తో
క్షణాలు!
అరువు తెచ్చుకున్న స్వప్నంలా,
ఎవరిదో విన్న మాటలా.

గోడకి వ్రేళ్లాడ గట్టిన కెలండరులా, పిట్ట-
గోడ మీద ఎండుతున్న దృష్టి.
కసాయివాడి అంగడిలా
జీవితం.
(మొండెం) తెగిన మేకపోతుల్లా-
ప్రాణంలేక, ఆకారంలేక, నగ్నంగా-
వేళ్లాడుతూ స్మృతులు.

## కలం కుంటు పడింది

తారాసింగ్

మూసి ఉన్న కిటికీ
తెరిచెయ్యండి-
ఇహ లాభం లేదు
సగంచేసి విడిచిన-
సందిగ్ధపు పనుల దుర్గంధంతో
గదంతా కుళ్ళు కంపు కొడుతోంది.
మనిషీ! నీ ముందు
నా కొడుకు - కలం
కుంటివాడు,
ఎందుకూ కొరగాని వాడయ్యాడు!
భాషల్ని గురించి
నాల్గు ప్రశంసా వాక్యాలు పలికి,
కలాన్ని గిరవాటు పెట్టండి.

(అను: నిర్మలానంద)

తెలుగు :

## తిరుగబడు

‘ఐ’

కనురెప్పలు గ్రుడ్లమీద ఆరగట్టి
నోట్లో నాలుకను అణచిపెట్టి
శక్తినంతటినీ అవయవాలలో తొక్కిపట్టి
ఇంకా ఎందుకోసం.........

చుట్టూ భయం కార్చిచ్చులా వ్యాపిస్తుంటే
బ్రతుకులు బండరాళ్ళీడుస్తుంటే
శునకాలు కనకపు సింహాసనాన కొలువుతీరి
వెక్కిరిస్తుంటే
ఇంకా దేనికోసం.........

కోర్కెల్ని కాల్చేసి, నాల్కల్ని చింపి, ఎముకల్నెండబెట్టి
చర్మం వొలుస్తూవుంటే
పళ్ళమధ్య బాధని బిగబట్టి
కనుగుంటల్లో కన్నీటిని మురగబెట్టి
ఇంకా ఎవరికోసం.........

దశాబ్దం కింద చచ్చి
ఈనాటికీ శ్మశానం అందుకోలేక
బంధుమిత్రుల కన్నీటికోసం కాచుక్కూర్చొని
ఇంకా బ్రతికున్నానని భ్రమపడుతున్న
శవంలా పడివున్నావ్?
తిరుగబడు !

ఆధునిక హిందీ సాహిత్యం :

# నయీ కవిత - ఆ తర్వాత....

నిఖిలేశ్వర్

అత్యాధునిక హిందీ కవిత్వం 1940 ఆ ప్రాంతాల్లో నిత్యనూతనప్రయోగాలతో ప్రారంభమై నేటికి శాఖ ప్రశాఖలతో కొత్త పుంతలను తొక్కుతూ నిరంతరం సాగిపోతున్నది. భావకవిత్వం (ఛాయావాద్ లేక స్వచ్ఛందతావాది కవిత్వం) వాస్తవతా రహితంగా ఊహాలోకాల్లో సంచరిస్తున్నప్పుడు ఆధునిక హిందీకవిత 'నయీకవిత' పేరుతో భూమిని-భూమిమీది మనుష్యుల్ని సాహిత్యలోకంలో ప్రతిష్ఠించింది.

మొదట్లో "నయీకవిత" అభ్యుదయ-ప్రయోగవాది తత్వాలతో మిళితమై గొంతువిప్పుకుంది. అప్పుడే అజ్ఞేయ్ (సచ్చిదానంద్ హీరానంద్ వాత్స్యాయన్) తమ ఆధునిక దృక్పథంతో హిందీకవితను ప్రయోగ ప్రక్రియగామార్చి నూతనఅవకాశాలను సృష్టించారు. ఆయన తొలుత "తార్ సప్తక్"అనే ప్రథమ ఆధునిక కవితా సంకలనాన్ని తమ సంపాదకత్వంలో వెలువరించారు. ఏడుగురు కవుల ఈ "తార్ సప్తక్" (నక్షత్ర సప్తకం) ఆనాటి హిందీ కవిత బూజుదులిపి నూతన ఉత్తేజాన్ని - బలాన్ని ఇచ్చింది. సంకుచితమైన వ్యక్తి స్వచ్ఛందవాదంతో క్రుంగిపోతున్న భావకవితా ధోరణులను ఈ సప్తకం నిలువునా ఊపివేసింది. ఈ ప్రథమ సంకలనంలో వచ్చిన ఏడుగురు కవులు అభ్యుదయ - నిత్యప్రయోగాత్మకమైన తత్వాలతో కవితలు రచించారు. ఈ ఏడుగురు కవులు గజానన్ మాధవ్ ముక్తిబోధ్ (స్వర్గీయ), నెమీచంద్ర జైన్, భారత్‌భూషణ్ అగ్రవాల్, ప్రభాకర్ మాచ్వే, గిరిజాకుమార్ మాథుర్, రామవిలాస్‌శర్మ, అజ్ఞేయ, వీరిలో ముక్తిబోధ్, రామవిలాస్‌శర్మ ప్రధానంగా అభ్యుదయ దృక్పథానికిచెందినవారు. మరీ ముఖ్యంగా ముక్తిబోధ్ తన కవితలలో తన జీవితానుభవాల లావాను ఎగచిమ్మాడు. అన్నిరంగాలలో సాగుతున్న దోపిడిని ఆయన ఎంతో ఆవేదనతో చిత్రించి సామాన్య మానవుని విముక్తికి ఎలుగెత్తి విప్లవాన్ని ఆహ్వానించాడు. ఇక ప్రభాకర్ మాచ్వే మరాఠీ మాతృభాష అయినా హిందీలో అనేకరకాలైన ప్రయోగాత్మక కవితలను

రచించారు. అజ్ఞేయ్ ఆధునిక దృక్పథాన్ని, వ్యక్తి స్వేచ్ఛను - ప్రకృతి స్వచ్ఛంద జీవితాన్ని తమ ఖండికలలో అభివ్యక్తీకరించారు. వీరికి పూర్వమే మహాకవి నిరాలా వివిధ శైలి విన్యాసాలతో ఆధునిక ముక్తచ్ఛంద్ కవితను సుసంపన్నంచేశారు. ఆయన తమ ప్రయోగాలతో విభిన్న కవితా శిల్పాల్ని సృష్టించారు కాని వస్తునిరూపణలోకాదు. అజ్ఞేయ్‌మాత్రం వస్తునిరూపణలోకూడా నిత్యనూతన ప్రయోగతత్వాన్ని నిరూపించారు. ఒకవిధంగా నిరాలాను ఆధునిక హిందీ వచనకవిత ప్రథమ ప్రయోక్తగా భావించి ఆధునిక హిందీ సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసివుంటుంది. అయితే సాంఘిక యధార్థానికి ప్రాధాన్యతయిచ్చిన నిరాలా తమ చివరిరోజుల్లో అతి మానసికవాదానికి అరవిందుని తత్వానికి అంకితమైపోయారు. అజ్ఞేయ్‌కూడా ప్రకృతిని, మానవున్ని, అధునాతన ప్రతీకలతో, బింబాలతో నయీకవితలో వ్యక్తంచేసినా ప్రస్తుతం తమ ఇటీవలి కవితలలో భావకవితా ధోరణిలోకే దిగజారిపోయారు.

ఆతర్వాత అజ్ఞేయ్ సంపాదకత్వంలోనే ద్వితీయ, తృతీయ "తార్ సప్తక్"లు వెలువడ్డాయి. ద్వితీయ "తార్ సప్తక్"లో వున్న కవులు భవానీ ప్రసాద్ మిశ్ర, శకుంత్ మాథుర్, హరినారాయణ్ వ్యాస్, శమ్‌షేర్ బహాదూర్‌సింగ్, నరేష్ మెహతా, రఘువీర్ సహాయ్, ధర్మవీర్ భారతి. వీరిలో శమ్‌షేర్ బహాదూర్‌సింగ్ విభిన్నమైన మానసిక స్థితుల్లో ప్రకృతిపరమైన, అభ్యుదయ వైఖరిగల కవితలు రచించారు ఇతన్ని వైవిధ్యంగల కవిగా విమర్శకులు భావిస్తున్నారు.

ధర్మవీర్ భారతి హిందీ వచన కవితను పరిపుష్టంచేసినవాళ్లలో ముఖ్యులు. ప్రతి విలువనుప్రశ్నిస్తూ భారతి సంశయాత్మతో బయలుదేరి యధార్థవాది మనస్తత్వంతో రచనలు చేశారు. ముఖ్యంగా వీరి "అంధాయుగ్" అనే వచన కావ్య నాటక కృతి విమర్శకుల ప్రశంసలుపొంది సాహిత్య ఉపలబ్ధిగా నిలిచిపోయింది. భారతి అజ్ఞేయ్ అవలంబించిన వచన కవితాశైలిలోనే పయనించారు. పద్యంలోని గద్యంలోని లయ భేదాన్ని వీరిద్దరు పాటించలేదు.

తృతీయ "తార్ సప్తక్"లో సంకలితమైన కవులు వీరు- ప్రయాగ్ నారాయణ్ త్రిపాఠి, కీర్తి చౌదరి, మదన్ వాత్స్యాయన్, కేదార్‌నాథ్ సింగ్, కున్వర్ నారాయణ్, విజయదేవ నారాయణ్ సాహీ, సర్వేశ్వర్ దయాల్ సక్సేనా. ఈ కవులలో కున్వర్ నారాయణ్ ప్రధానంగా తాత్వికమైన ఇతివృత్తాలతో కావ్యాలు రచించారు. "ఆత్మజయా" అనేకావ్యం నచికేత ఆఖ్యాయనం ఆధారంగా దార్శనిక విశ్లేషణతో వర్తమాన జీవితాన్ని ఆకళింపుచేసుకొని కున్వర్ నారాయణ్ రచించారు.

సర్వేశ్వర్ దయాల్ సక్సేనా ఈనాటివరకు నిత్యనూతనంగా శక్తివంతమైన కవితా ఖండికలను సృష్టిస్తున్నారు. జీవితంలోని చేదునిజాలను సమకాలీన సమాజ నగ్నసత్యాలను కవిత్వంలో మలచి హృదయాన్ని హత్తుకునేలా సక్సేనా వ్రాస్తున్నారు.

ఈమూడు సంకలనాలలో వచ్చిన కవుల్లో గిరిజాకుమార్ మాథుర్, భారత్ భూషణ్ అగ్రివాల్, హరినారాయణ్ వ్యాస్ ఆధునిక జీవితాన్ని, విస్తరిస్తున్న యాంత్రిక నాగరికతను, నీరసమైన వర్తమాన మనుష్యుల జీవితబింబాలను చిత్రిస్తున్నారు.

నయీకవితకుచెందిన ఈ కవులందరు యధార్థవాదాన్ని చాలావరకు శైలిలో, అభివ్యక్తిలో ఉపయోగించుకొన్నారు. కొందరు భావభూమికలో ఆంతరంగ చైతన్యాన్ని, మార్మికవాదాన్ని వ్యక్తంచేశారు. నిరాలా, నాగార్జున్, శమ్‌శేర్‌సింగ్ తదితరులు మార్క్సిజం ప్రభావంతో సాంఘిక న్యాయానికి, సగటు మనిషి సంక్షేమానికి అభ్యుదయధోరణిలో ఆవేదనను వెలువరించారు. కాని వీరెవరూ ఆద్యంతం అభ్యుదయ కవితా ప్రక్రియను ఏకనిష్ఠతో ఆరాధించలేదు.

నయీకవిత ఆధునిక ప్రయోగశీలత్వంతో భారతీయ చింతనను సమకాలీన జీవనగతులను కొన్ని పౌరాణిక ఇతివృత్తాలతో సమన్వయించి నిరంతరం ప్రవహిస్తుండే భారతీయతత్వాన్ని కొనసాగించే ప్రయత్నంకూడాచేసింది. భారతి రచించిన "అంధాయుగ్", నరేశ్‌మెహతా కావ్యం "సంశయ్ కీ ఏక్ రాత్", దుశ్యంత్‌కుమార్‌కావ్యం "ఏక్ కంఠ్ విషపాయీ" కున్వర్ నారాయణ్ రచించిన కావ్యం "ఆత్మజయీ" ఈ ప్రయత్నంలోని భాగాలే.

ఆధునిక హిందీ కవిత ''ఆధునికత'' అనే నూతనభావ పరంపరలోమనిషిని లఘుమానవుడిగా దర్శించి సమకాలీన ప్రపంచంలో నిస్సహాయుడిగా జీవించేవ్యక్తిని ప్రతిబింబించింది. సంశయాత్మను, కింకర్తవ్య విమూఢత్వాన్ని వ్యక్తం చేసింది. మనిషిని అసహాయుడిగాచూసి తపించింది. మానవవాదంతో ప్రత్యేకించి వర్గసంఘర్షణ లేని వ్యవస్థను ఊహించి ముందుకుసాగింది. స్వర్గీయ నందదులారే వాజ్‌పేయి లాంటి ప్రఖ్యాత విమర్శకులు ఈ మానవవాదాన్ని మతప్రమేయంలేని తాత్విక చింతన అని ప్రశంసించారు. అతిశయమైన వైయక్తిక బలహీనతలు, భావకవితాధోరణిలాంటి లోపాలుకూడా వున్నాయని ఆయన ఎత్తిచూపారు.

ఈ నయీకవిత ప్రక్రియలోనే ''నకేన్‌వాద్'' కవులు ఒక అతివాద ఉద్యమంగా బయలుదేరి ముందుకు వచ్చారు. ప్రయోగాత్మకమైన కవితలో తీవ్రవాద

ధోరణిలో ఈ నకేన్‌కవులు కేవలం ప్రతీకాత్మకమైన కవితను, ఏ వాదానికి లొంగని అసలు కవిత్వాన్ని ప్రచారంలోకి తేవాలని ప్రయత్నించారు. ఈ కవులలో ముఖ్యులు నళిన్ విలోచన్ శర్మ, కేసరీ నారాయణ్, నరేష్. ఈ కవులు "నకేన్" అనే పేరుతో తమపేర్లలోని తొలిఅక్షరాలను తీసుకొని సంకలనం వెలువరించారు. తమ నకేన్‌వాద్ కవిత్వాన్ని 'ప్రపద్యవాద్' అనే పేరుతోకూడా పిలిచి కవిత్వంలో మేధో పక్షానికి ప్రాధాన్యత ఇచ్చారు. అయితే ఈ ఉద్యమం కొంతకాలంమాత్రమే సాహిత్య లోకంలో నిలిచింది.

నయీకవితలో మరోముఖ్యమైన కవి జగదీశ్‌గుప్త. ఇతను చిత్రకారుడు, సాహితీవేత్త కూడా. కవిత్వంలో రసానుభూతి స్థానంలో ''సమానుభూతి'', ''అర్థ లయ'' అనే కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించి పోషించారు. అయినా ఆ తర్వాత రసానుభూతిని మళ్లీ అంగీకరించి అనుభూతి ప్రధానమైన కవితను రచించారు. ప్రకృతి చిత్రణలో శ్రీగుప్త వ్రాసిన కవితలు యదార్థానికి బదులుగా యదార్థప్రభావానికిమాత్రమే సన్నిహితమైనవని శ్రీనంద్ దులారే వాజ్‌పేయ్ సమీక్షిస్తున్నారు

శ్రీ జగదీశ్‌గుప్త నయీకవితకు ఈమధ్య కొత్తనిర్వచనాలుయిస్తూ ఆ కవితా తాత్వికధోరణిని ఇలా విశ్లేషించారు.

నూతనవిలువలతో ప్రేరితమై స్వాతంత్ర్యం వచ్చినతర్వాత నెలకొన్న దేశ స్థితిగతులను చిత్రించేది; నిత్యనూతనమైన కవితావిలువలతో, ఉర్వరమైన సృజనా త్మకశక్తితో అనుభవాల నూతన ప్రమాణాలను పట్టిఇచ్చేది; అపరిచితమైన అభివ్యంజ నతో, ప్రచలితంకాని భంగిమలతో, అద్యతన ప్రభావాలను స్వీకరించి విచిత్రమైన శిల్పం పోకడలతో అతినూతన ప్రవృత్తులతో కొనసాగేది నయీకవిత.

నయీకవితపై తిరుగుబాటుగా వచ్చిన నూతన కవితా ప్రక్రియలు బోలెడన్ని వున్నాయి. వాటిలో ''అకవిత''మాత్రమే కొంచెం భావబలంతో మరికొంచెం తిరుగు బాటు ఆక్రోషంతో నిలబడింది. 1963 ప్రాంతాలలో శ్రీ జగదీశ్ చతుర్వేది సంపాద కత్వంలో "ప్రారంభ్" అనే కవితా సంకలనాలు వెలువడ్డాయి. వాటిలోనే ఈ ''అకవిత'' కావ్యధోరణికి అంకురార్పణ జరిగింది. ఆ తర్వాత జగదీశ్ చతుర్వేది "అకవిత"అనే పేరుతో వరుసగా 10 సంకలనాలదాకా పత్రికారూపంలో ప్రచురించారు. ఈనాటి చాలామంది సమకాలీన యువకవులు ఈ 'అకవిత'నుఅనుసరించారు. ఆశ్చర్యం ఏమిటంటే 'అకవిత' మొదటి సంచికలోనే ''తార్‌సప్తక్'' మొదటిసంపుటానికి చెందిన కొందరు పాతకవులు చోటుచేసుకున్నారు పేరుకోసం. ముద్రారాక్షస్ అనేకవి మొదటి సంచికతర్వాత అకవితనుండి విడిపోయి ఆఉద్యమాన్ని వ్యతిరేకించడం ప్రారంభించారు.

మొదట్లో అకవిత Anti Poetry (కవితా విరోధి)గా తత్వాన్ని సమకూర్చుకొని బయలుదేరినా ఆ తర్వాత 'వ్యక్తి అంతర్విరోధాల అన్వేషణనే అకవిత' అనే నిర్వచనాన్ని శ్యామ్ పరమార్ ఇచ్చారు. సంప్రదాయాన్ని ధ్వంసంచేస్తూ, భిన్నమైన మార్గంగుండా పయనిస్తూ, మారిన సౌందర్య అవగాహనతో వ్రాయడమే "అకవిత" అని ఈ కవులు చెప్పుకున్నారు.

ఈనాటి ఆధునిక మానవుని వైఫల్యాలను, నైరాశ్యభావాన్ని, ఏకాకితనాన్ని, బలహీనతను, నగరజీవితంలో అస్తిత్వంలేని గుంపు జీవిగా బ్రతికే వ్యక్తి లఘుత్వాన్ని శక్తివంతంగా కొంతవరకు ఈ 'అకవిత' చిత్రించింది. కాని ఆ తర్వాత కేవలం సెక్స్‌పదాలను, గుప్తాంగాలను మాత్రమే జుగుప్సకోసం వర్ణించడం మొదలైనది. ఒక విశిష్ట లక్ష్యం ఉత్తమ ఆశయం లోపించినందువల్ల ఈ అకవిత "రతిప్రదర్శన" గా మాత్రమే మిగిలిపోయింది. Psychic Short-cut గా అది పనికివచ్చిందితప్ప Literary Shortcutగా పనికిరాలేదని నయీకవిత కవి జగదీశ్‌గుప్త అకవితను విమర్శించారు. "అకవిత" లో వ్రాస్తూ వచ్చిన యువకవి సతీశ్ జమాలీ యిటీవల "ధర్మయుగ్" వారపత్రికలో తన "ఆత్మస్వీకృతి" వ్రాస్తూ "అకవిత" కవులందరు మానసిక రుగ్మతతో, సెక్స్‌పదాలమోజులో సులభంగా పేరు సంపాదించుకోవాలని కవిత్వం వ్రాశారని వెల్లడించాడు. ఆ తర్వాత ఈ "ఆత్మస్వీకృతి" సాహిత్య వివాదానికి దారితీసింది.

(విడిగా నయీకవితకుచెందిన ఒక కవిత, "అకవిత"కుచెందిన ఒక కవిత తెలుగు అనువాదాలు ప్రచురిస్తున్నాము. సం॥ )

ఈసాహిత్య స్థంటు ఇలా సాగుతుండగానే అత్యాధునిక హిందీ కవితలో మంచి రచనలు చేస్తున్న కొందరు కవులు నిరాటంకంగా వ్రాస్తున్నారు. వీళ్లల్లో ముఖ్యులు శ్రీకాంత్ వర్మ, నయీమ్, దూధ్‌నాథ్, జ్ఞాన్ రంజన్, మమతాకాలియా, గంగాప్రసాద్ విమల్, శలభ్ శ్రీరామ్ సింగ్.

ఈ కవులందరికి భిన్నంగా తిరుగుబాటుతో నిర్భయంగా అరాచక జీవితంతో నిజాయితీగా వ్రాసినకవి రాజ్‌కమల్ చౌధరి. ఇతను బీటనిక్కుల ప్రభావంతో హిందీ కవిత్వంలో నిర్భీకమైన భావమయ ప్రపంచాన్ని సృష్టించాడు. అరాచక జీవితంలోని ఆనందాన్ని ఆ ఆనందం చివరికి అనుభవించవలసివచ్చే శారీరక మానసిక దారుణ పరిణామాల్ని రాజకమల్ కవిత్వంలోనేకాకుండా తన వ్యక్తిగత జీవితంతో నిరూపించాడు. ఇతని అకాలమరణం తర్వాత కొందరు కేవలం అనుకరిస్తూ మరికొందరు రాజకమల్

లోని నిజాయితీ అంశాన్ని పునికి పుచ్చుకొని తిరుగుబాటుగా కవిత్వం వ్రాస్తున్నారు. వ్యక్తిగతంగా శ్రమకు ఖర్చుకు నిలచి నిర్భీక ఆలోచనాప్రవాహాలతో అనేకమైన చిన్న పత్రికలను (Small Magazines) వెలువరిస్తున్నారు.

ఈనాడు భారతీయ భాషల్లో హిందీ సాహిత్యంలో జరుగుతున్నన్ని ప్రయోగాలు, సాహిత్య దుమారాలు, చర్చలు, పత్రికలు, రచయితలు మరోభాషలో జరగ డంలేదని అనుకుంటే ఆశ్చర్యంలేదు. ప్రస్తుతం ఒకవైపు పాతుకపోయిన సాహిత్య పత్రికలు, ప్రసిద్ధ రచయితలు, మరోవైపు కొత్తగా సాహిత్యసేవకు నడుంకట్టిన చిన్న పత్రికలు తిరుగుబాటు తత్వంతో జీవిస్తున్న యువరచయితలు సజీవమైన సమకాలీన యథార్థసాహిత్యంకోసం ఒకరకమైన సాహిత్యకయుద్ధం చేస్తున్నారు. ప్రసిద్ధ రచయితలు Established అయిపోయి Established Commercial cum literary Magazines లో సంపాదకస్థానాల్లోవున్నారు. వీరిని వ్యతిరేకిస్తున్నారు యువకవుల్లోని కొందరు తిరుగుబాటు కవులు.

ఈనాటి అత్యాధునిక హిందీ సాహితీప్రపంచాన్ని స్థూలంగా పరికించాలంటే ఈ కింది ఆసక్తికరమైన అంశాలుకూడా తెలుసుకోడం అవసరం.

గడిచిన ఈ ఐదు సంవత్సరాలలో రకరకాల పేర్లతో హిందీలో కవితోద్యమాలువచ్చాయి. వీటిలోకొన్ని బీట్‌కవుల ప్రభావంతో, బెంగాల్ ఆకలితరం కవుల ప్రభావంతో, మరికొన్ని తెలుగు దిగంబర కవుల ప్రభావంతో ఉద్భవించినవని హిందీ సాహిత్య విమర్శకులే అంగీకరిస్తున్నారు. రకరకాల కవితోద్యమాల పేర్లు ఇవి. సనాతన్ సూర్యోదయీ కవిత, అపరంపరావాది కవిత, సీమాంతక్ కవిత, యుయుత్సావాదీ కవిత, అస్వీకృత్ కవిత, అకవిత, సకవిత, అ-అకవిత, అభినవ కవిత, అధునాతన్ కవిత, నూతన్ కవిత, నాటకీయ్ కవిత, ఎంటీ కవిత, నిర్దిశాయామీ కవిత, లింగ్వాదల్ మోత్‌వాదీ కవిత, అబ్సర్డ్ కవిత, గీత్ కవిత, నవ ప్రగతివాదీ కవిత, సాంప్రతిక కవిత, బీట్ కవిత, ఠోస్‌కవిత(కాంక్రీట్)కోలాజ్, అన్యథావాది, విద్రోహీ, ఘుత్కాతర్, కబీర్‌పంథీ, సమాహారాత్మక్, ఉత్కవిత, వికవిత, బోధ్, ముహూర్త్, ద్వీపాంతర్, అతి, టటకి, తాజీ, అగలీ, ప్రతిబద్ధ్, శుద్ధ, స్వస్థ, నంగీ, గలత్, నహి, ప్రాప్త్, సహజ్, ఆంఖ్ కవితలు........

ప్రస్తుతం వెలువడుతున్న చిన్న సాహిత్య పత్రికలు:—

మాధ్యమ్, కల్పన, అణిమ, లహర్, అకథ్, కృతిపరిచయ్, ఆవేశ్ (ఇవి పెద్దపత్రికలే కానీ వాణిజ్యపరంకాని విశుద్ధ సాహిత్య పత్రికలు.)

వికల్ప, కవిత, అకవిత, హస్తాక్షర్, గల్పభారతి, వాతాయన్, సంజ్ఞా, ఆకంఠ్, త్రిజ్యా, నీరా, బిందు, అముఖ్, ఆరంభ్, సంబోధన్, సామాంత్, యుయుత్సా, మూల్యాంకన్, ఏకాంత్, అనువృత్, దర్పణ్, కెక్టస్, ఉపలబ్ధి, దిశా, అక్షర్, కథాభారతి, ప్రారంభ్, నాగ్‌ఫణి, రూపాంబర, అంకన్, ఆరతి, మధుకామిని, రానీ, కథాకార్, రంగ్, నీల్‌పత్ర, అనామ్, సంచేతన, పరిదృశ్య, విభక్తి, ఇందు, అప్రస్తుత్, అంతర్, అర్థ్‌విశిష్టక్, సంప్రేషణ్, ఆద్యంత్, అవలోకన్, అ-రచన.

హిందీ: నయీకవితా.

# నైట్ షిఫ్ట్

హరినారాయణ వ్యాస్.

ఏకాంతపు ఆదిమ సజీవబాధను తాకాలని
దారితప్పిన వెన్నెల పాలరాతి వేళ్లను
చాస్తూ నగరం వెలుపలికి వెళ్లిపోయింది.
ఏకాంతం
నగరంనుండి
గూండాలతోపాటు బహిష్కృతం.
ఆఫీసులనుంచి బయలుదేరిన
దారుల పొడుగునా
పారదర్శకమైన అతృప్తి ప్రణాళికలు
సాగిపోతున్నాయి పావురొట్టె
పాలకూర అన్వేషణలో.

రోడ్లమీదికి పడుకోడానికి
కదులుతున్నారు అనికేతనులు
పక్కలులేనివాళ్లు, దేశదిమ్మరులు
జిప్సీలు.

వానాకాలంనాటి పేరులేని రెక్కల పురుగులు
విశాలమైన రోడ్లపైన నిలబడిన
ఆధునిక విద్యుచ్ఛక్తి ఆవరణతో ఢీకొని
రాలిపోతున్నాయి.

దినమంతా దాచుకొన్న ఆకలిని
తన కొత్త చెప్పులను
తలకింద పెట్టుకొని
నిద్రిపోతున్నాడు ఊరువిడిచి
నగరం వచ్చిన కార్మికుడు
మరీ కొత్త బిచ్చగాడు.
సప్తరంగుల నైలాన్ తెరలతో
తెరలు తెరలుగా
మృగ మరీచిక తృష్ణలు
పాశవిక మూర్ఖత్వాలు
కుటుంబం విడిచి
బయట పడుతున్నాయి సందుల్లోంచి.
పరిచితుల అపరిచితమైన వివశత్వపునవ్వు
కేవలం సందర్భవశాత్తు
సాన్నిహిత్యపు సుఖాన్ని అనుభవిస్తోంది.

ధగధగ మెరుస్తున్న గదుల్లో
కుక్కలు. పిల్లులు. పాములు. కొండచిలువలు
తేళ్లు. ఎలుకలు, రాబందుల జంటలు
నిద్రిపోయేముందు
మార్చుకుంటున్నాయి దుస్తులు.

గడిచిన రోజు
ఒక యుగం
గడుస్తున్న రాత్రి కేవలం ఒకక్షణం.

చెడిన యంత్రాలు
ఉత్పత్తి చేస్తున్నాయి దుష్పరిణామాలని.

రేపు ఉదయం
అధిక ధరలకుగాను
అమ్మకానికిగాను
దుకాణాల్లోకి పంపిస్తున్నారు
ఈ నూతన ఉత్పత్తిని.
అదే రేపటి కొత్త ఫ్యాషన్
కొత్త మర్యాద
రేపటి కొత్త సత్యం.

(అను: నిఖిలేశ్వర్)

హిందీ - అకవిత :

## భయం లేని వాడు

జగదీశ్ చతుర్వేది

ఒక విశాల సర్పం చుట్టుకొంది మొత్తం నగరాన్ని
భయావహమైన సముద్రమథనంలో నుసి అవుతున్నానునేను।
సంస్కృతి వాంతిచేసుకుంటుంది కుప్పలుగా పేడపురుగుల్ని- దోమల్ని- పురుగుల్ని
నగ్నఅధరాలపై కుష్ఠుగాయంతో బాధతో అరుస్తోంది మానవత
నీలంగామారిన దేహంతో, వాచిన రొమ్ములతో స్త్రీలుజంకుతున్నారు గర్భస్రావంకోసం।
సురక్షితంగాలేరు మానవుల పిల్లలు-పిల్లులు-శిశువులు
ఒక గుండ్రటి బోనులో బందీలై ఆర్తనాదాలు చేస్తున్నారు।
బాకుతో పొడిచి సతీత్వాన్ని దోచేవాళ్లు నపుంసకులైపోయారు
ఆసుపత్రుల్లో భయభీతులై డాక్టర్లు నల్లకళ్లజోళ్లు ధరిస్తారు
స్త్రీల బహిష్టు ఆగిపోయింది।

గొడ్డుదేశంలో గుడ్డిరోడ్డుపై ట్యూబ్ అమర్చారు
అక్కడికివెళ్లి యౌవ్వనవతులు పిల్లల్నికంటారు
నపుంసకులైన తండ్రులు ఢోలువాయిస్తూ తిరిగివస్తారు.

విషం కక్కుతున్న తోకలో చుట్టుకొన్నవాళ్లు కోతుల్ని తిడుతున్నారు
తమ నవవివాహిత భార్యలకు నిద్రామాత్రలు పంచిపెడుతున్నారు
భుజాలపై తాపీజులు కడుతున్నారు!

గాయాలునిండిన రొమ్ముల్లో మాంసంలేదు రబ్బర్‌ప్యాడ్‌లుతప్ప
నగరంలోని సగంమంది పేగులకోసం తిరుగుతున్నారు
క్షయవ్యాధి క్రిములు!

క్రిములునిండిన రొమ్ములు – బాధిస్తున్న నరాలకు సత్తువలేదు
ఎదుటివాణ్ణి గుర్తించలేని మనుష్యుల భయం
సొంతడబ్బాల్లో బందీలై చదువుకొంటారు గీత లేక కొక్కోకం
దేశం మొత్తం మారిపోతోంది ధర్మశాలగా!
మతంపేరున జీవించివున్నాయి కొన్ని గంట్లుపడిన స్తనాలు!
వాటిసేవలో నిమగ్నమైపోయింది ఈశతాబ్దం సాంతం
దేశం మొత్తం.
నేనుమాత్రం కాదు!

(అను: నిఖిలేశ్వర్)

# ఎల్లలులేని యువకళాయశస్వి
# యస్. వి. రామారావు.
## అతని అరూ

చలసాని ప్రసాదరావు.



ఒకటిన్నర, రెండు దశాబ్దాలక్రితం మన మేధావివర్గం సంఖ్యలో అల్పంగా ఉన్నదశలో వారిలోనేగాక సామాన్యులలోకూడా చిత్ర, శిల్పకళల్ని గురించిన పరిజ్ఞానం గానీ, పరిచయంగానీ కనీసం పరిమితరూపంలోనైనా ఉండి ఉండేది.

లలితకళలుగా మనం ప్రధానంగా గుర్తించి గౌరవిస్తూన్న సృజనాత్మక ప్రక్రియలలోకెల్లా అసంఖ్యాకమైన ప్రయోగాలకూ, నూతనరీతులకూ, ఎడతెగని వాద వివాదాలకూ ఆలవాలమవుతూ మిగిలిన కళారూపాలన్నింటికన్నా ఎంతోముందుకు పయనించిన ప్రక్రియ చిత్రకళ.

కాని, మన మేధావివర్గస్థాయి, సంఖ్యకూడా గణనీయంగా పెరిగిఉన్న నేటి పరిస్థితుల్లో మనమధ్యగల వాతావరణంపై దానికి పూర్తిగా విరుద్ధంగా ఉండటం, ఆధునిక చిత్రకళపట్ల చెప్పుకోదగిన ఆసక్తిగాని, పరిచయంగాని ప్రదర్శితం కాకపోవటం ఆశ్చర్యకరంగా లేదా!

ఇటీవలికాలంలో చిత్రకళను మాన్యులకూ, సామాన్యులకూకూడా సన్నిహితంగా తీసుకుపోయి వారిలో అభిరుచిని, ఆదరణను, గౌరవాన్ని గణనీయంగా పెంపొందింపజేసిన చిత్రకారుడుగా "బాపు", మేధావివర్గంలో ఆసక్తికి, జిజ్ఞాసకు కారకుడైన నైరూప్య చిత్రకారుడుగా ఎస్. వి. రామారావూ గుర్తింపబడుతున్నారు.

అలాంటిస్థితిలో చిత్రకారుడుగా రామారావు ప్రత్యేకతలను గురించీ, అతని ప్రయోగాలలోని ప్రాధాన్యతలను గురించీ విరివిగా ప్రశ్నలు వినరావటం సహజం.

బాపు చిత్రాలను ఎవరూ ఎవరికీ వివరించ నవసరంలేదు. అవి అతను చూసేవారిని దృష్టిలో ఉంచుకుని అందరికోసం వేశాడుగనుక.

రామారావు చిత్రాలకు వివరణకావాలి; అతనవి చిత్రించేటపుడు ప్రేక్ష కులతని దృష్టిలో లేరుగనుకా. అనుభూతులు ప్రేరణనివ్వగా, సంవత్సరాలతరబడి శ్రమించి సాధించిన సాంకేతికనైపుణ్యంతోడవగా రూపొందిన ఆత్మచిత్రాలవిగనుకా.

* * *

గత దశాబ్ది కాలంలోనూ నామిత్రులూ, పరిచితులూనైన చిత్రకారుల్లో కొందరు విదేశాలకువెళ్ళి చిత్రకళాసాధనచేసి వచ్చినవారున్నారు. వారిలోకొందరిక్కడ ఉండగా అత్యున్నత బహుమతీ పురస్కారాల నందుకున్నవారు కూడా.

కాని, తిరిగివచ్చిన తరువాత వారు ప్రదర్శించిన చిత్రాలు నాకేగాక ఇతర చిత్రకారులకూ నిరాశను కలిగించాయి.

అందుకు కారణం వారిక్కడ అనుసరించిన రీతులను, నమ్మిన పద్ధతులను అక్కడకుపోయాక గౌరవించలేకపోయారు. కాగా అక్కడిరీతుల, సంప్రదాయాల లోని సుగుణాలను తమ స్వంతంచేసుకోగల దక్షతనూ ప్రదర్శించలేకపోయారు. ఆ విధంగా వారొక సందిగ్ధావస్థలోపడి అచేతనులైపోయారు.

ఈస్థితిని విజయవంతంగానూ, ప్రతిభావంతంగానూ కూడా అధిగమించగలి గాడు రామారావు. కనుకనే మనం యిప్పుడతని కళనుగురించి చర్చించుకోగల గౌర వానికతను అర్హుడయ్యాడు.

* * *

మొత్తం కామన్‌వెల్త్ దేశాలలోనే ఆనాటికి చిత్రలేఖనంలో ఉన్నత శిక్షణ నందేందుకుగాను కామన్‌వెల్త్ స్కాలర్‌షిప్ స్కీముక్రింద ఎన్నికైన ప్రప్రథమ భార తీయుడుగా సగౌరవంగా ఈదేశం వదలివెళ్ళినతరువాత గడచిపోయిన ఈ ఆరేళ్ళకాలం లోనూ రామారావు........

....తాను లండన్‌లో కళాభ్యాసం చేస్తూన్న స్లేడ్ స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో ఓసంవత్సరం అత్యుత్తమ లిథోగ్రాఫర్‌గా ఎన్నికై గౌరవింపబడ్డాడు.

....రెండున్నర సంవత్సరాలపాటు నిశ్శబ్దంగా, నిర్విరామంగా భిన్న, భిన్న ప్రక్రియలతో ప్రయోగాలుచేసి, చేసి చివరకు 'తనదీ' అనుకున్న నూతనరీతినిసాధించి

1964 ఆఖర్లో లండన్‌లో తన మొదటి కళాప్రదర్శన ఏర్పాటుచేసి వెంటనే గుర్తింపు లోకి రాగలిగినంతగా ప్రశంసల నందుకున్నాడు.

....మరో రెండు మాసాల తర్వాత అమెరికా వెళ్లగా న్యూయార్క్‌లోని మ్యూజియం ఆఫ్ మోడరన్ ఆర్ట్‌వారు అతని చిత్రాన్నొకదాన్ని కొని, ఏదేశ చిత్రకారులైనా మహోన్నత గౌరవంగా భావించే ఆ మ్యూజియంవారి గుర్తింపుకు ఇతన్ని పాత్రుణ్ణిచేశారు.

....రెండేండ్లకొకసారి జరిగే కామన్‌వెల్త్‌దేశాల కళాప్రదర్శనలలోపాల్గొని అత్యుత్తమ చిత్రకారుడుగా ఎన్నికై బహుమతినందుకున్నాడు.

....లండన్ టెలివిజన్‌లో అసిస్టెంట్ ఆర్ట్ డైరెక్టర్‌గా నియమితుడైన ప్రప్రథమ పాశ్చాత్యేతరుడు ఈ రామారావే.

....భారత, న్యూజీలండ్, ఇంగ్లాండ్, అమెరికా దేశాల నేషనల్ మ్యూజియంలలో ఆతని చిత్రాలకు గౌరవస్థానం లభింపచేసుకున్నాడు.

....ఇంగ్లాండ్‌లోని అత్యున్నత శ్రేణికిచెందిన చిత్రకళారంగంలో ఆధునికుల్లో యింతవరకూ పికాసోవంటి విశ్వవిఖ్యాత చిత్రకారులు ముగ్గురు, నలుగురిని మాత్రమేగుర్తించి గౌరవించిన విక్టోరియా అండ్ అల్బర్ట్ మ్యూజియం రామారావును గుర్తించి ఆముగ్గురు, నలుగురి చిత్రాల సరసనే ఇతని చిత్రాన్నీ అలంకరించింది.

....ఓ అమెరికన్ యూనివర్సిటీచే చిత్రకళాధ్యాపకునిగా ఆహ్వానింపబడి ఇటీవలనే ఆ దేశం వెళ్లాడు.

ముప్పైరెండు సంవత్సరాలక్రితం కృష్ణాజిల్లా గుడివాడలో పుట్టిన రామారావులో ఈనాటి రామారావుకూడా అక్కడే రూపుదిద్దుకోసాగాడు. తండ్రి ఆ చుట్టుప్రక్కలకెల్లా పేరుమోసిన దారుశిల్పి. ఆయన రామారావును మలచాలనుకున్నది ఇంజనీరుగా లేదా కనీసం డాక్టరుగా.

కాని రామారావు చదవసాగింది ఎకనమిక్సుని. అదే సమయంలో చిత్రలేఖనంలో శిక్షణ పొందసాగినది ఈనాడు తెలుగుదేశమంతటా కొన్ని వందలమంది శిష్యుల్ని నిలబెట్టి నేటికీ విజయవాడలో స్కూల్ ఆఫ్ ఆర్ట్ నిర్వహిస్తూన్న ప్రముఖ చిత్రకారుడు శ్రీ వేణుగోపాల్‌వద్ద. ఆసమయంలో ఆయన గుడివాడలోనేవుండేవారు.

అదేకాలంలో రామారావులో చిత్రకళలోనూ, సాహిత్యంలోనూ తృష్ణ రేకెత్తించి ఒక స్థాయికిరావటంలో తోడ్పడినవారు మేడూరి వెంకటప్పయ్యశర్మ, కీ.శే. డాక్టర్ శ్రీదేవి.

సినిమాల్లో చేరదామని మద్రాసువచ్చిన 'బి. కాం. కుర్రాడు' రామారావును స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో చేర్పించి ఋణగ్రస్తుణ్ణి చేసుకున్నవారు కళాదర్శకులు వి. సూరన్న, మాధవపెద్ది గోఖలేలు.

మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్సులోని ఆరేండ్ల డిప్లొమాకోర్సును నాలుగేండ్లలో పూర్తిచేయగలిగిన దక్షతను చేకూర్చిపెట్టినవారు కళాక్షేత్రంలోని చిత్రకళాధ్యాపకులు శ్రీ కె శ్రీనివాసులు.

కళపట్ల చూపుతున్న గౌరవాన్ని, సాధిస్తున్న విజయాలను సహించలేని పరిసరాలు కుళ్లగామారగా ముండ్లపొదపై పడకగా తయారైన స్కూల్ ఆఫ్ ఆర్టుజీవితాన్ని వదలించుకోజూస్తున్న తరుణంలో వెన్నుతట్టి, నిలబెట్టి, ప్రోత్సాహాన్నీ. చేయూతను యిచ్చినవారు సుప్రసిద్ధ కళావిమర్శకులు కీర్తిశేషులు శ్రీ జి. వెంకటాచలం.

లండన్ వెళ్లిన తొలిరోజుల్లో ఓ జాబులో వ్రాశాడు రామారావు– "నేనిప్పుడిక్కడేంచేస్తున్నానో ఊహించగలరా? మోడల్స్‌ముందుకూర్చుని లైఫ్‌స్కెచెస్, లైన్ డ్రాయింగ్స్ వేస్తున్నాను" అని.

ఆఉత్తరమేగనుక అప్పట్లో మరో చిత్రకారుడెవరైనా చదివి ఉన్నట్లయితే నవ్వి లేదా నవ్వుకుని ఉండేవాడు.

చిత్రకళాశాలల్లో చేరిన ఆరంభదశలో ప్రతివిద్యార్థీ చేసేపని ఈ మోడల్స్ ఆధారంగా రేఖాచిత్రరచన చేయటమే. ఇది అతని కళాజీవితంలోని బాల్యదశ.

అలాంటపుడు దాదాపు ఎనిమిదేళ్ల కళాభ్యాసంచేసి, మరో రెండేళ్ల రీసెర్చ్ స్కాలర్‌గా కళాసాధనచేసి. మరీ లండన్ చేరుకున్న రామారావు ఇలా అక్కడ శ్రీకారంచుట్టాడూ అంటే వింతగానే వుంటుందిగదా।

కాని అందులోనే ఉంది రామారావు సాధించిన ఇన్ని విజయాల వెనుకగల రహస్యం.

అత్యున్నత ప్రమాణాలనందుకున్న సాధారణ కళాస్థాయియే ఈనాటి ఆధునిక చిత్రకళారూపం అనేది ఈనాడు చాలామంది మరచిపోతున్నారు.

రూప నిర్మాణంలో ద్రష్టయై ఆయా రూపాల స్వభావాల నవగతంచేసుకోగలి గినవారే అరూపంలోనూ రూపాన్నిదర్శించి, దర్శింపజేయగల శక్తి కలిగివుంటారుమరి.

*   *   *

కవిత్వంలోవున్నట్లే చిత్రకళలోనూ ఉంది సింబాలిజం అనేది. 'ఏడు కొండలవాడు' అన్నపుడు తిరుపతిలోని వేంకటేశ్వర స్వామిగాని, పద్మలతల మధ్య ప్రదర్శింపబడిన పాదాలను దర్శించినపుడు బుద్ధుడుగానీ, కుంచెను చూడగానే చిత్రకారుడుగానీ ఎందుకు స్ఫురిస్తున్నారూ అని ఈనాడెవరూ సందేహించటంలేదు. కారణం వారు అందుకు అలవాటుపడిపోయారు గనుక. ఆయా పరచితరూపాలకీ అసమగ్ర రూపాలను చిహ్నాలుగా వారేనాడో గుర్తించేశారుగనుక.

వందలమాటలు వివరించలేనిభావాన్ని ఒక్కరేఖ, అందంగా, శక్తివంతంగా, లయబద్ధంగా మలుపులుతిరిగిన ఒక్కరేఖ విప్పిచెప్పగలదని నానుడి.

ఆ నానుడిని నిజంచేసే యత్నంలో పుట్టిపెరిగినదే ఆధునిక చిత్రకళ.

చిత్రలేఖనానికిలొంగని విషయవస్తువంటూ లేదు, ఏ భావాన్నయినా శక్తి వంతంగా దర్శింపజేయగలదది తేడాఅల్లా "ఎలాచూపాలి" అనే సమస్యను పరిష్కరించుకోగలగటంలో ఉంది. కాలంతోపాటు పరిష్కారమార్గాలూ మారుతూ వస్తున్నాయి తప్ప ఇప్పుడమాంతం ఒచ్చిపడ్డదేమీలేదు.

*   *   *

ఎక్కడికో ఉదాహరణలకు పోనక్కర్లేదు. మన అజంతా చిత్రాల్లోనే ఒకటున్నది. బుద్ధుడు భిక్షాపాత్రతోరాగా యశోధర రాహులునిచేత భిక్షవేయిస్తున్న దృశ్యమది.

అది అజంతా చిత్రకారులకు అలవాటయిన సాధారణశైలిలోనే చిత్రించబడింది. కాని యశోధరా రాహులులు బుద్ధుని మోకాళ్లవరకయినా రానంతటి మరుగుజ్జులుగా చూపబడ్డారు. అందుకు కారణం బుద్ధుడు మిగతావారికన్నా మహోన్నతుడని చెప్పదలచటమే. అలా చెప్పటానికి ఆనాటి చిత్రకారునికి తోచిన మార్గమది. అర్థంచేసుకోగలవారికది భావస్ఫోరకంగా గోచరిస్తుంది. లేనివారికది అసహజమే మరి.

అబ్‌స్ట్రాక్ట్ ఆర్టును తనదిగా చేసుకున్న చిత్రకారుడు చేస్తున్నదీ దాదాపు ఇటువంటిదే.

పరిణతినొందిన సింబాలిజమ్ అరూపకళ అనికూడా మనం అర్థంచెప్పుకోవచ్చు.

ఒక వస్తువు, లేదా రూపం, లేదా దృశ్యం యొక్క బాహ్యరూపం అందరికీ సుపరిచితమే గనుక దానినే మరలా, మరలా, వేరే, వేరే రంగులువులిమి చూప యత్నించటం వృథా! దాని అంతర్గతరూపాన్ని దర్శింపజేయగలగాలి, అనేది ఈనాటి చిత్రికారులలో అధిక సంఖ్యాకులమతం.

అంతవరకూ అపరిచితంగా ఉండిపోయిన ఆ రూపానికి రూపకల్పన రేఖలలోగాక కేవలం రంగులలోనే చేయబడినప్పుడది ఇతరులకపరిచితంగా, అగ్రాహ్యంగా ఉండటం సహజమేగదా. అదే జరుగుతోందికూడా.

చలాన్ని మనం చూశాం. చదివాం. 'చలం' అనగానే ఈనాడు మనకేం స్ఫురిస్తోంది. రమణాశ్రమంలోవున్న ఈనాటి చలంగాక మనల్నాకట్టుకున్న అతని రచనలే తక్షణం స్ఫురించటంలేదా! మన మన అభిరుచుల్నిబట్టి అమీనాయో మరో పాత్రోమనోపథంలో మెదలటంలేదా! 'చలం' అనే భావానికి ప్రతిగా మన మనసుల్లో పేరుకుపోయిన జ్ఞాపకాలకది మచ్చుతునకగాదా.

శ్రీ శ్రీ అనగానే 'ఖడ్గసృష్టి' కన్నా, 'మూడుయాభైల' కన్నా 'మహాప్రస్థానమే'మన స్ఫురించటం లేదా! అందులోని మహావేగంతో సాగిపోయే కవితలోవి ఘోష మన కర్ణకుహరాలలో గింగురుమనటంలేదా! స్వయంగానో, ఫోటోల్లోనో చూసిన శ్రీశ్రీ రూపం మన కండ్లముందు ఎందుకు మెదలటంలేదు! మన అనుభవాన్నిబట్టి, అధ్యయనశక్తి నిబట్టి మనకుతెలియకుండానే మనలో అవి నివాసముండిపోయాయ్.

ఏ టూరిస్ట్ గైడ్ లోనో విజయవాడను పరిచయం చేయదలచినవాడు ఏకనక దుర్గగుడి తాలూకు ఫొటోనో ఆపరిచయం ప్రక్కన వేస్తాడు. రానురాను విజయవాడను గుర్తించటానికి ఆగుడి అనేది సింబల్ గా తయారవుతుంది.

కాని. నేనెన్నో సంవత్సరాలు విజయవాడతో గడిపాను. ఆడుళ్లో నాకు పరిచయంలేని ప్రాంతంలేదు. ఈనాడు నేను విజయవాడను చిత్రించాలి నా కాన్వాసు మీద. విజయవాడ అనగానే నాకు స్ఫురించేది కృష్ణానదిలోంచి బయలుదేరిన ఓ పెద్ద కాలువ, అంతలోంచి చీలిపోయి, సాగిపోయే మరి మూడుకాల్వలు. వాటిమధ్యనా ఆ చుట్టూరానూ ఇరుకిరుకుగా పెరిగిపోయిన మురికివాడ.

నేను దాన్ని గుర్తించిన రూపంలో చూపగల విధానంలో చిత్రించాను. చూసినవారంటారు, 'ఇదా విజయవాడ? ఏమిటామూడు పొడవాటిగీతలు? వాటిమధ్య ఆ పెంటకుప్పలేమిటి?' అని.

నేను చెప్పి 'ఔరా' అనిపించుకోగలగాలిమరి! ఎందుకంటే అందులో ఏముందా అనీ, విజయవాడ ఎక్కడుందా? అనీ వారు వెదుకుతున్నారుగనుక. వారు చూసిన, చూస్తున్న విజయవాడకూ, నేను చూసిన, నాలో రూపకల్పన చేసుకున్న విజయవాడకూ యెక్కడా పోలికేలేక వారు ఆ చిత్రాన్ని చూసి అయోమయంలో పడి పోయారు గనుక.

అదే నా తోటి చిత్రకారుడో, నా భావాలెరిగిన, నా చిత్రణావిధానాన్నెరిగిన సన్నిహితుడైన కళాభిమానో అయితే వారందులోని భావానికన్నా కళావిలువలకెక్కువ ప్రాధాన్యతనిస్తూ పరిశీలిస్తారు. ఎందుకంటే ఆ చిత్రంలోని 'విజయవాడ' అనేది నా చిత్రణకాక ఆలంబనం మాత్రమేగనుకా, చిత్రకారుడుగా నా నైపుణ్యాన్ని ప్రదర్శించే యత్నంలో 'విజయవాడ' అనే సబ్జెక్ట్ నాకొక ఆలంబనగామాత్రమే వినియోగపడింది గాని అదే ప్రధానంగాదు గనుకా, అది కేవలం విజయవాడే కానక్కర్లేదు, మరేవూరికి వాడయినా కావచ్చు. ఎందుకంటే నాచిత్రంలోని విజయవాడ నాకళ్లుచూసిన విజయవాడగాక నామనసు అర్థంచేసుకున్న విజయవాడమాత్రమే.

*　　　*　　　*

అయితే అలాగే ఎందుకుచిత్రించాలి? కాస్త నలుగురికీ అర్థమయేలాగే ఆ భావాల్నెందుకు ప్రదర్శించరాదూ? అనేమాటనూ తేలికగా తీసివెయ్యలేం.

కాని,

కవిత్వం వ్రాసేవాడు హృదయంలోంచి లావాలా భావాలెగదన్నుకువస్తున్న సమయాన మాటలకోసం తడుముకోడు. భాషతో మంచి పరిచయం ఉన్నవారెవరూ భావాలకు మధ్యలో బంధంవేసి మంచి మంచి అందమైన మాటలకోసం బుర్రలోని డిక్షనరీని తిరగేస్తూ కాలయాపనచేయరు.

కవికి ఆ పదజాలమెలాంటిదో చిత్రకారునికి వర్ణం అలాంటిది.

కళకు ప్రాణం వర్ణం.

చిత్రకారుని సామర్థ్యాన్ని నిర్ణయించేది అతని వర్ణలేపనా నైపుణ్యం.

నిలబెట్టగలిగేది అతని భావసంపద.

*　　　*　　　*

వడ్డాది పాపయ్య చిత్రాలు మనం చాలాకాలంగా చూస్తూవున్నాం. నిండైన రూపాలు, బలమైన రేఖలు, కంటికింపైన రంగులు వాటికి ఆకర్షణనూ, విలువనూ తెస్తూఉన్నాయ్. చూశాం, చూశాం ఆనందించాం. ఈనాడవి మనకు పాతబడిపో

యాయి. గతంలో ఇచ్చిన తృప్తినవి ఈనాటివ్వటంలేదు. అతని చిత్రిణ అలాగే నిలచిపోయింది గనుక.

కాని. వాటినిచూసి యీనాడూ ఆనందించగలుగుతున్న ప్రేక్షకుడంటాడు, "ఇంత అందమైనవికూడా మీకు నచ్చటంలేదా?" అని అదతని తప్పుగాదు. ఒకనాడు మనమున్న స్థానంలో ఈనాడతనున్నాడు, మనం నాలుగడుగులు ముందుకు వెళ్లాం. రేపతనూ ఈనాడు మనమున్న స్థానంలోకి చేరుకోగలిగినపుడు మన విమర్శలోని అర్థాన్నతను గ్రహించ గలుగుతాడనుభవపూర్వకంగా. అసంతృప్తిలో అతనూ పాలు పంచుకుంటాడు.

అలా ఆ నాలుగడుగులు ముందుకుపోయినవాడే నేటి ఆధునిక చిత్రకారుడు.

*　　　*　　　*

రామారావు లండన్ వెళ్లి ఓ తెల్లవారుజామున అకస్మాత్తుగా అరూప చిత్రకారుడుగా అవతారమెత్తలేదు.

కళ ఒక నిర్విరామ సాధన.

ఆరేళ్లక్రితం అతనువేసిన చిత్రాలలోనూ నేటి అతనికళకు మూలమైనభావా లున్నాయి. నాటికి అతని చిత్రాల్లోని రూపాలు పూర్తిగా అరూపమైపోలేదు. అరూపంలోకి పరివర్తనచెంద యత్నిస్తున్న భావాలుమాత్రం కొట్టవచ్చినట్లు కనుపించేవి. 'యువతితో హైనా', పర్వతాలూ—చెట్లూవంటి చిత్రాలనేకం ఈకోవకే చెందుతాయి.

లండన్ వెళ్లాక విశాలమైన అతనిచుట్టూగల కళాప్రపంచం, నిశితపరిశీలన, నిర్విరామ సాధన ఆ పరివర్తనను త్వరితంచేసి సహకరించాయి.

కాగా, అతనందుకున్న స్థాయిని అంచనావేసి, విలువ గ్రహించి ఆదరించి గౌరవస్థానమివ్వగల కళాప్రియులక్కడితనికి లభ్యమయ్యారు.

రామారావునుగురించి వ్రాసిన పాశ్చాత్య కళావిమర్శకులు దాదాపు అందరూ ఏకగ్రీవంగా ఒకమాట అన్నారు.

ప్రాచ్య, పాశ్చాత్య కళావిధానాల మిశ్రమంతో రూపొందిన ఒకనూతనశైలి అతని చిత్రాల్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తోందని.

అవనీంద్రనాథ టాగోర్ వాటర్ కలర్స్‌లో టెంపరా విధానంలో తన చిత్రాలలో ప్రదర్శించిన అపూర్వమైన వెలుగును తన చిత్రాలలో ఆయిల్ కలర్స్‌లో తేవాలనేది తన యత్నమని రామారావు ఓసారి అన్నాడు.

అలాంటి వెలుగు నేటి రామారావు చిత్రాలన్నింటా ప్రత్యక్షం. ఆరంగుల సమ్మేళనం అతని చిత్రాల్ని వంద ఇతర చిత్రాలమధ్యకూడా ఇట్టే మొదటిచూపుతోనే ఆకర్షించి కట్టి పడవేస్తుంది.

'ఇవీ, ఫలానా చిత్రకారునివి' అని అవే చెప్తాయి మనకు.

ఏ చిత్రకారుడయినా తన కళలో సాధించాలని కోరుకునేది ఇటువంటి ప్రత్యేకతనే, విశిష్టతనే.

దాన్ని రామారావు సమగ్రవంతంగా సాధించాడు.

*　　　*　　　*

ఇటువంటి నూతన విలువల పరిధిలో చిత్రింపబడిన చిత్రాల్లో 'లేపాక్షి' అనే చిత్రంలో మనకు లేపాక్షి కనుపించదు. రామారావ్ కనుపిస్తాడు. అతనిరంగులే కనుపిస్తాయి. కాని వర్ణపరిజ్ఞానం ఉన్నవారికి అతని 'భీతరస'లో ఆ రసంకనుపిస్తుంది. కేవలం కనుపించటమేగాదు భీతినే కలిగిస్తుంది. అలాగే 'సాంధ్యరాగం' మనల్ని కదలిస్తుంది. కరిగిస్తుంది. అందుకు కారణం ఆయా చిత్రాల్లో అతనువాడిన సింబల్స్, రంగులూ వాటిసమ్మేళనం మనల్ని ఆయాభావాలకు సన్నిహితంగా తీసుకుపోగలిగేట్లున్నాయి గనుక.

'లేపాక్షి' అనేదానికి మనమెరిగిన రూపం ఉంది. కనుక మన అనుభవానికి ఈచిత్రం దూరం.

'భీత రసా'నికి గాని 'సాంధ్య రాగా'నికి గాని స్థిరరూపమంటూ ఏదీ లేదు, కనుకనే మన ఊహకిక్కడ అవకాశం దొరికింది. ఊహించాం. ఊహబలపడటానికి చిత్రకారుని సామర్థ్యం, దృష్టితోడై అనుభూతినీ యిచ్చాయి.

*　　　*　　　*

ఈసంచిక అట్టమీది వర్ణచిత్రంలో పేరునుబట్టి చూస్తే మనకు విజయవాడ కనుపించదు. దాని సరసనగల కృష్ణానదీ గోచరించదు. కనుపించేదల్లా రంగులూ, వాటిల్లోంచి తొంగిచూసే చిత్రకారుడూనూ.

మనకు తెలిసిన విజయవాడనుగానీ, కృష్ణనుగానీ చూప యత్నించలేదు చిత్రకారుడు. వాటి చుట్టూ తనలో గూడుకట్టుకున్న భావాన్ని చూపదలచాడతను.

మనమూ అతని భావాన్నందుకో యత్నిద్దాం.

కృష్ణ ఒడ్డునుంచో, ఒడ్డునగల కొండమీదినుంచో చూస్తే కనుపించే పరిమిత దృశ్యాన్ని వదలి మనం కాస్త పైకి వెళ్లదాం.

ఏం కనిపిస్తోందిప్పుడు ?

రెండుకొండల మధ్యగా పారే నీలి ప్రవాహం, ఒకవైపు పచ్చని పొలాలు. మధ్యమధ్య మరీ ముదురురంగులో చెట్లతలలు పిల్లకాలువలు. మరోవైపు మహా నగరం. రోడ్లు, సందులు, గొందులూ కనిపించవు స్పష్టంగా. కనుపించేదల్లా అస్త వ్యస్తంగా రూపొందిన నగరం. రోడ్లపై ఉరకలతో సాగిపోయే నిర్విరామ యాత్రి. అల్పంగా, అసమగ్రంగా గోచరించే జీవన సంగ్రామపు ఛాయాలు.

మేఘాలను కూడా దాటి ఇంకాస్త పైకి వెళ్లుదాం.

ఇప్పుడు దృశ్యం పూర్తిగా మారిపోలేదా !

ఇంతవరకూ సూచనగా కనిపిస్తూవచ్చిన దృశ్యాలన్నీ అదృశ్యమై వాటి ఛాయలు మాత్రమే కనుపిస్తున్నాయిగదా. ఇట్టిస్థితిలో అంతకుముందు మన కళ్లుచూసిన దృశ్యాన్ని, అందులోని వివిధ వివరాలను ఇప్పుడు మనోనేత్రంతో వెదకి ఏది ఎక్కడున్నదో గుర్తించ యత్నించటం లేదా మనం.

ఈ స్థితిలో మనకు ఆ గుర్తింపుకు తోడ్పడుతున్న ఆధారాలేమిటి ?

ఆయా ప్రాంతాల తాలూకు స్థూల స్వరూపాలేగదా. ఒక దానిని మరొక దానినుండి విడగొట్టి చూపుతున్నవి వాటి స్థూల రూపాలూ రంగూ కాదా.

ఈ స్థితిలోనించి కనుపించే 'విజయవాడవద్ద కృష్ణానది'ని చిత్రించాడు రామారావు, దానికి ఇంకాస్త భావన తోడయింది. రంగులు వేగంగా తారాడాయి.

చిత్రం క్రింది భాగంలో గజిబిజిగా ఉన్న రంగుల సమ్మేళనాన్ని అస్తవ్యస్తమూ, సంకులమూనైన నగరానికి చిహ్నంగా మనం తీసుకోవచ్చు. వేగంగా మెలికలు తిరిగి పోతూన్న కృష్ణానదినీ గుర్తించవచ్చు. పైన ప్రశాంతంగా ఉండే ఆకాశాన్నీ స్వచ్ఛవర్ణాల్లో గుర్తించవచ్చు. మధ్య నిప్పులు గ్రక్కే సూర్యుడీ రంగుల్ని మరింతగా వెలిగింపజేయటాన్నీ గుర్తించవచ్చు.

ఇక్కడితో చిత్రకారుని భావం పూర్తయింది.

దీన్ని చిత్రించిన రామారావే ఇదే ఇతివృత్తం తీసుకుని మరో పాతిక చిత్రాలూ వేయవచ్చు. రంగుల మిశ్రమం అనేదానికి అంతంలేదు. ఉన్న వర్ణాలలోంచే అసంఖ్యాకంగా మరిన్ని సృష్టించగలం. చిత్రానికీ, చిత్రానికీ వర్ణాలు మారి కంటికి అందే ఆహ్లాదంలో మార్పునూ తెస్తాయి. చిత్రంలో స్థిరరూపాలంటూ ఏవీ లేవుగనుక చిత్రకారుని వర్ణస్వేచ్ఛకు హద్దులూ లేవు.

అదే అరూపకళ ఇచ్చే ఒక ప్రధాన సౌకర్యంకూడా. ఈ స్వేచ్ఛ ఎటువంటి దంటే ఈ చిత్రం ఇప్పుడు కేవలం 'విజయవాడవద్ద కృష్ణానది' మాత్రమే అనుకోనవ సరంలేదు. అటువంటి పరిసరాలున్న మరేదయినాకూడా కావచ్చు 'లండన్‌వద్ద థేమ్సు నది' కావచ్చు. కాకినాడవద్ద కాలువ కావచ్చు. ఎందుకంటే ఈ అన్నింటి మధ్యాగల ఏకత్వాన్ని అరూపకళ సన్నిహితం చేస్తోంది గనుక.

కానీ, చిత్రకారుడు దీన్ని చిత్రించే సమయంలో అతనిలో మెదలుతూన్న భావాలు అతని గత అనుభూతుల్లోని 'విజయవాడవద్ద కృష్ణానది'నే ఆలంబనంగా చేసుకున్నాయి గనుక అతనికి మాత్రం అవి అంతే.

మరాఠీ కవిత :

## ఏదో చూచాన్నేను........

వినాయక్ గోవింద్ కరండికర్

ఏదో చూచాన్నేను
విచ్చిన్నమైపోగా

యదార్థం తెలుసుకున్నాను :
వేలగుండెల్లో పేలిలేందుకు వేచివున్న విస్తారనిస్సహాయతను
పలికించేందుకు మాటలు చాలవునాకు.
అనేక లక్షల కళ్లలోని అంగారకబాధను
చల్లార్చటానికి కళ్లు చాలవునాకు।
ఆజన్మ శరణార్థినీ, అభాగ్యుణ్ణీ, అదృశ్యుణ్ణీ,
ఓమూల ఒదిగి మూల్గుతూన్న
అనాథ లోకాధ్యక్షుణ్నీ
స్వీకరించేందుకు చేతులు చాలవునాకు.
సిలువ వద్దు। నాకేవిలువ వద్దు।

ఏదో చూచాన్నేను
పగటివేళ భయంకర స్వప్నం
బాటల్లో బడుగుల గుంపులు
టిన్నుకప్పుల ఇరుకుటిండ్లు
పురుగులు పొర్లాడే సందులు
ఎముకలగూళ్లు, ఈడ్చుకుపోయి గుంటలైన కళ్లు
జవఉడిగీ చావలేనివాళ్లు
పొగలుచిమ్ముతూనూ రగులుకోలేనివాళ్లు
వగిచి గొణుగుతూనూ గర్జించలేనివాళ్లు

ఏదో చూచాన్నేను
అది నన్ననుకోకుండా కబోదినిచేయగా
ఈఃడిపస్‌లా
బడుగుల అడుగుఃజాడలబడి భ్రీమారణ్యంలోకి ఈడ్చుకుపోబడి
వారిసత్వపు వత్సనాభి చింపిరికొమ్మల నీడలు
నామనస్సులోనూ నర్తిస్తూండటం గుర్తించాను

కొండంత కొమ్మల బరువు
పండనోచని పసికాయలు
మండి మాడిన నిండారపూచిన పూలు
ఆ అన్నింటి అట్టడుగున
చల్లని సమాధి.

ఏదో చూచాన్నేను
విచ్ఛిన్నమైపోగా.

# యువతరం

సురమౌళి

[ 1968 ఏప్రిల్ 7వ తేదీన హైదాబాదులో 'యువభారతి' నిర్వహించిన చర్చాగోష్ఠికి ప్రతిపాదించిన వ్యాసం. ]

ప్రపంచ వ్యాప్తంగా తిరుగుబాట్లు జరుగుతూ వున్నాయి నిజమే; ఇందులో 'నిజంగానే' విజయవంతం అయ్యేవెన్ని ?— ఈ తిరుగుబాట్లు విఫలమైతే ఈ విశ్వానికి పట్టే దుర్గతి ఎలావుంటుంది ? మానవజాతి స్వేచ్ఛా విశ్వాసాలను పీల్చుకునే రోజు; సంపూర్ణ మానవజాతి తలెత్తుకు తిరిగేరోజు ఎన్నటికైనా రాగలదా ? వస్తే దానికదే రాగలదా దాన్ని లాక్కుని రావడానికి యువతరం ఏమైనా చెయ్యవలసి ఉన్నదా ? ఈ యువతరం తన బాధ్యతలను గమనించిందా ? గమనించడానికి కనీసం ప్రయత్నించిందా ?.... ప్రశ్నలు — ప్రశ్నలు.... 'ముక్తిబోధ్' రాసినట్టు (నా తెల్లని ముఖాన్ని నా నల్లని చేతులు బాదుతూ వున్నట్లు, ప్రశ్నల పరంపర. మస్తిష్కంలో సాగర మధనం.

వృక్షం సజీవంగా ఉన్నది అనడానికి నిదర్శనం వసంతంలో దానికి వేసే కొత్తచిగుళ్లే. ప్రతి కొత్త చిగురూ అంతకుముందు వృక్షానికి పేరుకొనిపోయి అతుక్కుని గట్టిగా బంధంవేసుకున్న బెరడును చీల్చుకుని, పగలచీరి బయటికివచ్చేదే. పరిశీలించి చూస్తే చిగురే లేతది; బెరడుకన్నా చిగురే సున్నితమైనది. అయినా సరే ఎంత తన్నుకున్నా, ఎంత బలీయంగా ఆపినాసరే చివరికి బెరడు పగులాల్సిందే— కొత్త చిగురు బయటికి రావాల్సిందే. బెరడు పక్షాన నిలబడి, అది పగిలినందుకు సంతాపాన్ని ప్రకటించే వాళ్ల కోవలోనివాణ్ణికాదు నేను. చిగురు మొలిచినందుకు సంతోషించేవాణ్ణి. ఈ చిగుళ్లన్నీ కొమ్మలుగా పెరిగి పుష్పించి ఫలించాలనుకొంటున్నవాణ్ణి. కాని మన సాంఘిక వ్యవస్థలో వేసే ప్రతి కొత్త చిగురూ, పెరక్కుండానే ఎండి పోతున్నందుకు బాధ పడుతున్నాను. కొమ్మగా పెరగడం అటుంచి ఆకు వేయకుండానే మాడిపోతూ వున్నది. బయటి ఎండ తీవ్రతకు కానీయండి, వృక్షంలో తగినంత జీవం లేకపోయి

నందువల్ల కానీయండి- లేదా అది రోగగ్రస్తమై ఉన్నందువల్ల కానీయండి. చిగుళ్లు పెరగడం లేదన్నమాట మాత్రం- చిన్నతనంలోనే మాడిపోతున్నా యన్నమాట మాత్రం వాస్తవం.

ప్రపంచంలోని యువతరంలో వచ్చిన తిరుగుబాటును రెండురకాలుగా విభజించవచ్చు. ఆకలిప్రాంతాలలో తలెత్తిన తిరుగుబాట్లు ఒకటి; రెండవది కడుపునిండిన ప్రాంతాలలో తలెత్తిన తిరుగుబాట్లు. కడుపునిండిన ప్రాంతాలలో, అమెరికా, బ్రిటన్ లాంటి దేశాలలోని యువతరంలో వచ్చిన తిరుగుబాటు నిజానికి యదార్థమైన తిరుగుబాటుగా కానవస్తుంది. యదార్థమైన తిరుగుబాటు అనగానే సమర్థనీయమైన తిరుగుబాటు అనిమాత్రం భావించవద్దు. సమర్థనీయమా కాదాఅన్న తర్కాన్ని ప్రక్కకుపెట్టండి. ఆ విషయాన్ని కాలాన్నే నిర్ణయించనివ్వండి. దానిమూలంలో, తత్త్వంలోఉన్నదాన్ని ఆధారం చేసుకుని చూసినట్లయితే అనిపించేది- ఈ రకం తిరుగుబాటు యదార్థమైనదని. భౌతిక సుఖసంపదలు బోలెడు. రొటీన్‌నుంచి విముక్తి కావడానికి మానవమేధస్సు పడే తపన, వేదన, సరైన అభివ్యక్తి దొరక్క పడే ఆక్రందన; తమకు దొరికినదారిన తోచినరీతిన పయనిస్తున్నది ఈ ప్రాంతాల్లోని యువతరం. గమ్యం చేరగలదా? లేదా? లక్ష్యసిద్ధిని పొందగలదా లేదా? అన్నచర్చ అప్రస్తుతం. తిరుగుబాటు యదార్థమైందైతే- లక్ష్యసిద్ధి జరిగేదాకా అన్వేషణ కొనసాగుతూనే వుంటుంది. గంజాయిలో తృప్తి పడక పోతే మరోవైపుకు దారిచూసుకుంటుంది. యోగం వేదాంతం మొదలైన వాటిద్వారా సేద తీరకపోతే మరోవైపు పయనిస్తుంది. నాకు తోస్తున్న ఒక సంగతినికూడా దాపరికంలేకుండా చెప్పేస్తాను. కడుపునిండిన ప్రాంతాల్లో కేవలం తమ తమ మానసిక తపనను తృప్తి పరచుకోవడానికి రేగిన ఈ యువతరం తిరుగుబాటులో విశ్వజనీనత, విశ్వవ్యాపకత చోటుచేసుకుని, ఆకలితో మాడుతున్న ప్రాంతాల మానవులకోసం, ఆ మాత్రం అభివ్యక్తి చేతగాని, శక్తి లేని, జీవం ఉడిగినప్రాంతాల మానవజాతిని సజీవం చెయ్యడానికి, సశక్తం చెయ్యడానికి పూనుకున్నట్లయితే బాగుండేది. మానవజాతిఅంతా ఒక శరీరంగా భావించినప్పుడు అది సజీవంగా ఉన్నదనడానికి నిదర్శనం దాని అంగాలన్నీ బలంగావుంటేనేగదా! లేకపోతే ఆశరీరానికి పక్షవాతరోగం పట్టిపీడిస్తున్నట్లేగదా!

ఆకలిదేశాల్లోని యువతరం తిరుగుబాటు మిధ్యా తిరుగుబాటు మాత్రమేనని ఎందుకంటున్నానంటే దాన్ని నడిపించేది వృద్ధులుకనుక. స్వప్రయోజనపరులైన రాజకీయనాయకులు- తదితరులు మనదేశంతో రకరకాలైన 'సేనల్ని' రూపొందిస్తూవుంటే దాన్ని యదార్థమైన యువతరం తిరుగుబాటుఅని ఎలా అనగలం? అయితే ఈ తిరుగుబాట్లు భస్మాసుర హస్తాల్లా సృష్టించినవారి తలలమీదే చేతులుపెట్టవచ్చు. తాము

సృష్టించిన తిరుగుబాటులను తామే అణచడానికి పూనుకోవలసిన అవసరం ముసలివాళ్లకు కలిగేస్థితిరావచ్చు. అంతమాత్రాన వీటికి 'యదార్థత' రాదు. వీటిని ముసలివాళ్లబ్రహ్మాస్త్రాలు చివరికి- తమ ప్రయోజనాలకు భంగకరంగా పరిణమించినప్పుడు ఏమిమి పారేస్తాయి.

సాహిత్యం, లలితకళలు సాంఘికస్థితిని ప్రతిబింబించే అద్దాలు. వాటిద్వారానే యువతరం తిరుగుబాటువాసన వెదజల్లేది. ఈప్రక్రియలు తిరుగుబాటు వాసనలు వెదజల్లేవిమాత్రమే కాని అవే తిరుగుబాటుకు నాయకత్వంకూడా వహిస్తాయన్న భ్రమలో మాత్రం ఎవరూ ఉండరాదు. వాసనలను వెదజల్లినంత మాత్రాననే తిరుగుబాటురాగలదన్న అతివిశ్వాసంకూడా భ్రమే. ఎవరో కొందరు దానికి నాయకత్వం వహించక తప్పదు; అందుకోసం కొన్ని వందల వేల మంది మార్టిన్ లూథర్ కింగ్‌లు బలికాక తప్పదు.

నిరాకారమైన ఈవాదనలలోనుంచి కొంచెం సాకారందగ్గరికి వద్దాం. మన దేశంలో మనచుట్టుపట్లవున్న స్థితిగతుల్ని పరిశీలిద్దాం. మన యువతరం తన తపనకు అన్వేషిస్తూవున్న అభివ్యక్తి మార్గాలను పరిశీలిద్దాం.

స్వాతంత్ర్యం మనదేశానికివచ్చి ఇరవైఏళ్లు దాటింది. ఇరవైఏళ్లకాలం ఒక తరాన్ని, ఒక కొత్తతరాన్ని రూపొందించడానికి పట్టేకాలం. అంటే స్వతంత్రభారతపు తొలితరం నేడు యువతరంగా అవతరించి వున్నదన్నమాట. స్వాతంత్ర్యం కోసం సంఘర్షణ యుగపు చివరిఅంచుల్లో జన్మించిన నేను స్వాతంత్ర్యయుగపు తొలితరాన్ని అన్వేషించడానికి ప్రయత్నిస్తాను. ఆ తరాన్ని పట్టుకొని "ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాలని, 'నీకు ఏంకావాలి?' అని అడగాలని ఉవ్విళ్లూరుతున్నాను. కాని ఏం చెయ్యమంటారు నాముందు నుంచునే ఓపికసైతంలేని నిర్జీవమైన ఈతరాన్ని యెలా ప్రశ్నించమంటారు? ప్రశ్నించిచూడు! ప్రశ్నఅనేది నా నోటినుంచి బయటికివచ్చిందో రాలేదో, సమాధానంగా ఏదేదో చెప్పేస్తున్నాడు- అడిగిందేకాదు, అడగబోయేదీ- అడగందీ, అన్నీచెప్పాలని గబగబా తనవ్యథను వెళ్లబోసుకోవాలని ఈతరంయువకుడు ఆరాటపడుతున్నాడు, కాని పాపం యేమీ చెప్పలేకపోతున్నాడు. నాకు యెదురుగా ఇలాంటితరాన్ని చూడవలసి వచ్చినందుకు నాకే సిగ్గుగా, అవమానంగా తలవంపులుగా వున్నది. ఈతరాన్ని రూపొందించడానికి, ఈ తరం తినే అన్నాన్ని వండటానికి ఆ పొయ్యిలో మంటలువేసింది నేనేగదా? అన్నం సరిగ్గా వుడకపోతే, ఈతరానికి అజీర్ణంఅయితే అందుకు నా బాధ్యతమాత్రం లేదూ?

అయినాసరే తన స్వాతంత్ర్యయుగపు తొలితరాన్ని చూచి గర్వించాలి; తొలితరంమీద ప్రతి జాతి అనేకమైన ఆశలు పెట్టుకుంటుంది. ఏతరాన్నిచూసి జాతి గర్వించవలసి ఉన్నదో ఆ తరంలోనే ఆత్మగౌరవం శూన్యమైనప్పుడు, ఏతరంమీద జాతి తన ఆశలను కేంద్రీకరించుకోవలసి ఉన్నదో ఆతరమే నిరాశా నిస్పృహలమధ్య నమసిపోతూవుంటే- జాతికి భవిష్యత్తు ఏదీ?

మనదేశపు సాంఘికవ్యవస్థ మనిషిని నిర్జీవంచేసింది. ఈదేశంలో ఇవ్వాళ 55 కోట్ల శవాలు తిరుగాడుతున్నాయి. జీవనం ఏమాత్రం లేదు. ఎలా వుంటుంది? భవిష్యత్తుపట్ల ఆశా లేదు, ఆత్మవిశ్వాసం అంతకన్నా లేదు. పిరికి, భయం ఒకవైపు. తిరుగుబాటు చెయ్యాలన్న తపన మరోవైపు- సరైన దారుల్ని దిగ్బంధనంచేస్తే ఆతపన తప్పుడు దారుల్లోనుంచి బయటపడటం సహజమేకద!

ఈ సాంఘికవ్యవస్థను సంపూర్ణంగా ఛేదించవలసిఉన్నది మనిషి సజీవంగా శ్వాస పీల్చుకోగల నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించవలసివున్నది. అందుకేమి చెయ్యాలె!........ ఏమిచెయ్యాలో నేను చెప్పడం భావ్యంకాదుగాని, లక్ష్యసిద్ధికి అనుగుణమైనపనులు ఏమైనాచెయ్యాలె.

విశ్వవిద్యాలయాల స్నాతకోత్సవాలు జరుగుతుంటే "మాకు డిగ్రీలు వద్దు; ఉద్యోగాలు కావాలి!" అని నినాదాలుచేసిన సంఘటనలు ఇటీవల నాలుగైదుచోట్లజరిగినట్లు వార్తలువచ్చాయి. యువతరం తపనకు సరైన అభివ్యక్తిగాతోచాయి ఈసంఘటనలు. అయితే అవి అంతటితోనే ఆగిపోవడం ఎందుకు? ముందుకు కొనసాగాలెగద! భయం అడ్డువచ్చిందా? ముసలివాళ్ల క్రౌర్యం బెదరించిందా వీరిని?

మనదేశంలో నిరుద్యోగం రోజురోజుకూ పెరుగుతూవుంది. భయంకర రూపం ధరిస్తూవున్నది. ఇప్పటికిప్పుడు దేశంలో 70 వేలమంది ఇంజనీర్లు నిరుద్యోగులుగావున్నారు. ఈసంవత్సరం 20 లక్షలమంది మెట్రిక్ పరీక్షలకు కూచుంటున్నారు. బి.ఏ; బి.ఎస్సి మొదలైన డిగ్రీపరీక్షలకు 5 లక్షలమంది కూచుంటున్నారు. ఏటా కళాశాలలనుంచి, హైస్కూళ్లనుంచి నిరుద్యోగులసైన్యం బయటికివస్తూవున్నది. ఈనిరుద్యోగం ఇంత పెద్ద ఎత్తున పెరిగిపోవడానికి మద్రాసీలు బొంబాయిలో ఉద్యోగాలుచేస్తూ వుండటమో, ఆంధ్రులు తెలంగాణాలో ఉద్యోగాలుచేస్తూవుండటమో కాదు, కారణం మరోచోట వున్నది. అసలు కారణాన్ని అన్వేషించనియ్యకుండా ఈ యువతరాన్ని 'శివసేన' ల నిర్మాతలు తప్పుడుదారులుపట్టించి తమలో తమకు పోరాటాలను సృష్టించి యువతరం యువతరం కొట్టుకునిచావాలని, ఆ శక్తి, ఆ ఆక్రమణ తమమీదికిరాకుండా

వుండాలని ముసలాళ్లప్రయత్నం. యువతరం కన్నువిప్పి యీ కుట్రను ఛేదించాల్సి వున్నది. ముసలిపెరడును నిర్దాక్షిణ్యంగా పగుల చీరాల్సివుంది.

భారతదేశచరిత్రలోనే ఈలోపంవున్నట్లు అనిపిస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు ఒకతిరుగుబాటు ఉవ్వెత్తుగా లేవడం, వెంటనే సమసిపోవడం, ముసలివాళ్ల విజయం సాధించడం- మళ్లీ యువతరం గాఢనిద్ర- కొన్నాళ్ల నిద్రతీసి యెప్పుడో ఒకప్పుడు మళ్లీ మేల్కొనడం- మళ్లీ నిద్ర. చార్వాకులుచేసిన తిరుగుబాటు సామాన్యమైనదా? బౌద్ధులుచేసిన తిరుగుబాటు సాధారణమైనదా? ఈ పొంగులన్నింటికీ అద్వయితంవేసిన బిరడాను తన్నేసేశక్తి పొంగుకు ఇంకా రాలేదేమో అనిపిస్తున్నది.

నేటియువతరంలో నిరాశ, నిస్పృహ గూడుకట్టుకునివున్నాయి. నలువైపుల నుంచీ సర్వాంగాల్నీ బంధించి వుంచినట్లు, నవరంధ్రాలనూ బిగించి శ్వాస పీల్చుకోకుండా దిగ్బంధనం చేసినట్లుగావున్నది బ్రతుకు. ఇవాళటి ఈ సమాజంలో బ్రతుకుతున్నవ్యక్తి తాను బ్రతికివున్నాడో లేదోకూడా తెలియకుండావుంది. బ్రతుకంటేఏమిటి? ఈబ్రతుకు ఒక బ్రతుకేనా? అనిపిస్తుంది. తన్ను వ్యక్తీకరించుకోలేనిస్థితేగదా మృత్యువంటే. ఇప్పుడున్నస్థితి మృత్యువుకన్నా ఏమన్నా మెరుగ్గావున్నదా? ఈబంధనాల్ని తెంచుకోవడానికి, ఈస్థితిని అధిగమించడానికి యువతరం పడుతున్నతపనను తమతమ స్వప్రయోజనాలకు ముసలివాళ్లు బాగా వినియోగించుకుంటున్నారు. హిందీభాష వస్తే నీకు ఉద్యోగాలు లభించవు. అంటే నిజమేననుకున్నాడు దక్షిణాది యువతరానికి చెందినవాడు; ఇంగ్లీషు ఉన్నంతకాలం నువ్వు వికసించలేవు- అంటే అదీ నిజమేననుకున్నాడు ఉత్తరాది యువకుడు. రకరకాల అబద్ధాలను నిజాలనినమ్మి బస్సులమీద రాళ్లు విసరి, రైళ్లను అటకాయించి, టెలిఫోన్ వైర్లు తెగ్గించి, బీభత్సం సృష్టించింది మనదేశపు యువతరం.

ప్రపంచంలో ఏదేశంలోకూడా పరీక్షలకు కూచున్నవారిలో నూటికి పది మందికన్నా తప్పరు. మనదేశంలోనో? నూటికి ఏభయిమందికన్నా తక్కువగా తప్పడం ఎప్పుడూవుండదు. ఇంకా యెక్కువే ఫేలవుతారు. అమూల్యమైన లేత జీవితపుకాలం ఎంతపెద్ద మొత్తంలో వృధా అయిపోతున్నదో గమనించారా ఎవరైనా? ఒకక్లాసులో పాసైతే ఆపైతరగతిలో చదువుకునే అవకాశం అన్ని దేశాల్లోనూ ప్రతి విద్యార్థికీ ఉంటుంది. ఈదేశంలో ఏదీ? చదివితే సరిపోదాయె, బాగారాస్తే సరిపోదాయె. ప్రొఫెసర్లకూ ముక్కుపొడుములకూ రోజూ సలాములుచేస్తేతప్ప, అవసరమైనప్పుడు వారి జేబులు నింపితేతప్ప ఉత్తీర్ణతకు అవకాశం ఉండదాయె. పాసయిం

తర్వాత ఉద్యోగానికి హామీఉండదాయె. వరకట్నం ఇస్తేతప్ప యెంత ఉన్నత విద్యాభ్యాసంచేసిన యువతికైనాసరే పెళ్లికాదాయె. లంచం ఇస్తేతప్ప కళాశాలలో సీటు దొరకదాయె- ప్రేమించిన యువతీ యువకులు పెళ్లిచేసుకోవడానికి కులాలు, మతాలు ఇనుపగోడలుగా అడ్డంవస్తూవుండె,

పరీక్షల్లో తప్పినా, కళాశాలలో సీటుదొరక్కపోయినా, సినిమాలో ఛాన్సు దొరక్కపోయినా, నాన్న కోపంగా మాట్లాడినా ఈ బలహీనమైన యువతరం ఈపిరికి యువకుడు ఆత్మహత్యకు పూనుకుంటున్నాడు. ఆత్మహత్య చేసుకోవడం నేరమాకాదా అన్న విషయాన్ని అలా వుంచండి. ప్రాణాలు యెలాగూ తీసుకోదలచుకున్నప్పుడు సార్వజనికమైన సమస్యలమీద; ప్రజాసమస్యలమీద, సునిశ్చితమైన లక్ష్యంకోసం ఆత్మహత్య చేసుకున్నట్లయితే దానికి ఫలితం వుంటుంది. పొట్టి శ్రీరాములు ఆత్మహత్య చేసుకున్నట్లు, బుద్ధ భిక్షువులు తమనుతాము కాల్చి చంపుకున్నట్లు, రంగుజాతి దురహంకారానికి వ్యతిరేకంగా ఆత్మహత్యలుచేసుకున్నట్లు, ఆత్మహత్య చేసుకోవాల్సిన స్థితిని నీకు కల్గించింది ఈ దుష్టమైన సాంఘికవ్యవస్థే అయినప్పుడు ఆత్మహత్య చేసుకోవడానికి నువ్వు ఎలాగూ సంసిద్ధమైనప్పుడు దాన్ని ఈ సాంఘికవ్యవస్థను పెరకడానికి ఆయుధంగా యెందుకు ఉపయోగించరాదు? ఈదేశంలో ఎన్ని ఆత్మహత్యలు జరుగుతున్నాయో. వానిలో పదోవంతు ఆత్మహత్యలు సునిశ్చిత లక్ష్యంకోసం జరిగివున్నట్లయితే ఈదేశంలో బలమైన తిరుగుబాటు ఎప్పుడో వచ్చిఉండేది. చాటుగా, కారణాలను వ్యక్తిగత విషయాలకు పరిమితంచేసుకుని బోలెడు ఆత్మహత్యలు జరుగుతున్నాయి ఈ దేశంలో. అలాగే చాటుగా, వ్యక్తిగత సౌకర్యాలకోసం బోలెడంత శాసనోల్లంఘనం జరుగుతూవున్నది ఈదేశంలో. బహిరంగంగా సునిశ్చిత లక్ష్యంతో శాసనోల్లంఘనం చేసినట్లయితే ఈ సాంఘికవ్యవస్థ ఏనాడో బాగుపడి వుండేది. దీనికంతకూ 'పిరికి' ప్రధానకారణంకావచ్చు.

ఈ పరిస్థితుల్లో యువతరం తిరుగుబాటు చెయ్యావలసిందే- చెయ్యడం లేదన్నదే నాబాధ. యువతరం ఉవ్వెత్తుగా తిరుగుబాటు చెయ్యడానికి ఈదేశంలో ఎన్ని కారణాలున్నాయి? ఎంత దుర్గంధం వ్యాపించివున్నది కడగాల్సింది. ఎంత బూజు మేటలువేసుకుని వున్నది దులపాల్సింది? ఎంత చెత్త పేరుకునిపోయింది దులపాల్సింది? కాని ఏదీ శక్తివంతమైన ఒక్క ప్రయత్నమైనా యువతరం సాగించిందా?

ఈదేశం ఇలా నిర్జీవంగా ఉండటానికి కులవ్యవస్థ, సంప్రదాయాలు, పరంపర ఇవన్నీ కారణాలే. మనిషిని మరోమనిషితో కలువనియ్యదు యీ కులవ్యవస్థ. మానవజాతిని సంపూర్ణంగా వికసించనియ్యదు ఈ సంప్రదాయం. ఎక్కడికక్కడ

అడ్డుగోడలు. చెమటోడ్చి పనిచేసేవాడు హీనకులస్తుడు. బిచ్చమెత్తి కడుపునింపుకునే వాడు, ఇతరుల శ్రమమీద బ్రతికేవాడు అగ్రకులస్తుడు. పదిహేనువేల ఏళ్లుగా సాగి వస్తూవున్న ఈ అసంగత వ్యవస్థను రూపుమాపడానికి యువతరం తిరుగుబాటు చెయ్య గలదా?

అందుకని యువతరం చేయవలసిన తిరుగుబాటు ఈ వ్యవస్థమీద. వారుసర్వ నాశనం చెయ్యవలసింది ఈ సాంఘిక నిర్మాణాన్ని దాని పునాదులను.

అక్కడక్కడా సాహిత్యంలోనూ తదితరరంగాలలోనూ యువతరం తిరుగు బాటుచేస్తున్న వార్తలు మనదేశంలోకూడా ఇటీవల పొడసూపుతున్నాయి. కాని అవి పనిపోవు. చాలా బలహీనంగా. అసమగ్రంగా ఉంటున్నాయవి. బెంగాల్లో ఒక యువతరానికి చెందిన కవి ఒకరోజున కలకత్తా నగరవీధుల్లో ట్రాఫిక్‌కు అడ్డంగా పడు కుని, పోలీసువాడు అడిగినప్పుడు "సాహిత్యం మంచిచెడుల్ని నిర్ణయించె అధికారం పోలీసులు ఎలా పుచ్చుకున్నార"ని ప్రశ్నించిన సంఘటన, హైదరాబాదు నగరంలో ఆవిర్భవించిన దిగంబర కవుల కవితోద్యమం యిందుకు ఒకటి రెండు ఉదాహరణలు. అయితే ఇలా తిరుగుబాటుచేస్తున్న ఈ యువతరంవాళ్లు మిగతాదేశంతో తాదాత్మ్యం పొందడంలేదు. పల్లెల్లో అక్షరజ్ఞానంలేకుండా దినమొలల్తో తిరిగిన శైశవావస్థనుంచీ కూలీనాలీ చేసుకుంటూ పెరుగుతున్న యువకులు, ఎన్నికల్లో రాజకీయ నాయకులిచ్చే రాళ్లతో కాలంగడిపి, మళ్లీ ఎన్నికలువచ్చేదాకా 'దాదాగిరీ' చేస్తూ, నాయకుల దయా ధర్మాలతో శిక్షలకు గురికాకుండా తప్పించుకునితిరిగే పట్టణాల్లోని తదితర యువతరాన్నీ ఈ ఉద్యమాలు అజలోకి తీసుకోవడం లేదనిపిస్తుంది.

విద్యావంతులైన యువతరానికీ, విద్యావిహీనులైన యువతరానికీ మధ్య విప రీతమైన అంతరం ఏర్పడుతూవున్నది. విద్య అభ్యసించిన యువకుడు శరీరకష్టాన్ని అసహ్యించుకుంటున్నాడు, చిన్నచూపు చూస్తున్నాడు. విద్య అభ్యసించగానే ఏకులానికి చెందిన యువకుడైనాసరే అగ్రకులానికిచెందినవాడిలాగ ఒక అంతస్థును ఏర్పాటుచేసు కుని దానిచుట్టూ గిరిగీసుకుని కూచుంటున్నాడు. నిజానికీ విద్యాభ్యాసం, వీరి వికసనం అంతా కోట్లాదిమంది యువకులు విద్యాగంధంలేక నిరంతరం చెమటోడుస్తూ బలిఅవుతున్నందువల్లనేనని, వారి చితాభస్మాన్నే తాను యెదగడానికి ఎరువుగా వాడు కుంటున్నానని, వారు ఓడ్చిన చెమటతో తన గద్దెకు పునాది నిర్మించుకుంటున్నానన్న ఇంగితజ్ఞానంకూడా విద్యాధికులైన యువతరంలో లేకుండాపోతున్నది. హరిజనులకిచ్చే ప్రత్యేక సౌకర్యాలతో పైకివెళ్లి ఉన్నత విద్యాభ్యాసం ముగించుకుని ఉన్నతపదవులు అధిష్ఠించినవారుసైతం హరిజనపేటలవైపుకు తిరిగిచూడటంలేదు. బ్రాహ్మణ బస్తీలలో

నివాసాలు ఏర్పరచుకోవడానికి ప్రయత్నిస్తున్నారు, సంఘంలో గౌరవం ప్రతిష్ఠా ఉన్నటువంటి, ఈ గౌరవప్రతిష్ఠలన్నీ వట్టి బూటకాలేనని, అనేకమంది పీడిత జనావళి అసువులను ఎరువుగా చేసుకుని పెరిగినవేనని తెలిసినాసరే, ముసిలాళ్లకు అయినా దగ్గరగా చేరడానికి, సన్నిహితంగా జరగడానికి ప్రయత్నిస్తున్నారేకాని తమ తోటియువతరంతో తాదాత్మ్యం చెందడానికి ప్రయత్నించడం లేదు. కడుపునిండిన దేశాలవైపు పేరాశగా దృక్కులు సారిస్తూ, పత్రికల్లో ఆయాదేశాల సాంఘిక వ్యవస్థలనుగురించి చదువుకుంటూ గుటకలుమింగుతూ తమవరకుమాత్రం ఆ భోగభాగ్యాలను సంపాదించుకోవాలని ఉవ్విళ్లూరుతున్నారు. మొత్తం జాతికి ఆస్థాయిని సమకూర్చాలని ఉవ్విళ్లూరితే అర్థం ఉన్నది; కాని అందరినుంచి, సంఘం నుంచి మిగతా జాతి నుంచి వేరుపడి, తమకు మాత్రం భోగాలను సమకూర్చుకోవడానికి విద్యావంతుడైన యువకుడు ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నంలో తనజాతికి చెందిన మరొకణ్ణి పీడించడానికిగాని, మోసం చెయ్యడానికిగాని దోపిడి చెయ్యడానికిగాని వెనకాడటంలేదు ఈ ధోరణికి మనదేశంలో చిరకాలంగా పాతుకుని పోయివున్నట్టి కులవ్యవస్థ ప్రధానకారణం కావచ్చు; విద్యా విధానంలో మొత్తంగా వున్నటువంటి అస్తవ్యస్తత, 'డొల్ల' తత్త్వముకూడా కారణాలు కావచ్చు. ఏదైనా ఈ వేర్పాటువల్ల, ఈ పలాయన వాదంవల్ల తిరుగుబాటురాదు; మిగతా యువతరంతో వికసిత యువతరం తాదాత్మ్యతను చెందదు. అంతయెందుకు ఈ యువతరం తిరుగుబాటులో స్త్రీలపాత్ర బొత్తిగా ఉండటంలేదు. పెళ్లిళ్లు కాకపోతేనేంగాక, వరకట్నాలు ఇచ్చేదిలేదు అని యెదురుతిరిగిన యువతులు ఏరీ? ఎంతమంది అడ్డంవచ్చినా ప్రేమించినవాణ్ణి పెళ్లి చేసుకుంటానని చాటిచెప్పగల వనిత ఏదీ?

కాని పరంపరాగతంగా వస్తున్న ఈ గౌరవప్రతిష్ఠల అసంబద్ధపు భావనలు ఛేదించినప్పుడుగదః స్త్రీ వ్యభిచారంచేస్తే అందరూ దూషించడమేనా? పురుషుడు వ్యభిచరించడం గొప్పతనంక్రింద లెక్కా? ఏమిటీ అన్యాయం? వ్యభిచారం అనే క్రియ కేవలం స్త్రీ వల్లగాని, లేదా కేవలం పురుషునివల్లగానీ జరుగదే? దూషణలు మాత్రం ఒక్క స్త్రీజాతికా?

నూతనతరం నిర్జీవంగా రూపొందడానికి కులవ్యవస్థవలెనే మిగతా సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలవలెనే పరాయిభాషకూడా ప్రధానకారణం, నా మాతృభాషలో నేను విద్యాభ్యాసంచేసే అవకాశం లేనంతవరకూ నాకు మానసిక వికాసం కలుగడం అసంభవం. మాతృభాషలో విద్యావిధానం అని అన్నప్పుడల్లా విదేశాలకు వెళ్లే విద్యార్థుల సంగతో? అని పిడివాదానికి దిగుతారు? 55 కోట్ల మందిలో విదేశాలకు వెళ్లేవారిసంఖ్య ఎంత? పదిలక్షలమందికి ఒక్కరుంటారో ఉండరో- వారికోసం మిగతా

వారిబస్రితుకులన్నీ దుర్భరంచెయ్యవలసిందేనా? అధ్యయనానికిబదులు, విద్యార్థిజీవితాన్ని బట్టీలు పట్టడానికి వెచ్చింప చెయ్యవలసిందేనా? విద్యాభ్యాసానికి మాతృభాషతప్ప మరో భాష మాధ్యమంగా ఉండకూడదనే నేనంటున్నాను. అంతేగాని మిగతా భాషలనువేనినీ అధ్యయనం చెయ్యరాదనేది నావాదంకాదు: ఇంగ్లీషేకాదు ప్రపంచ భాషలన్నింటినీ అధ్యయనంచేసే అవకాశాలు కళాశాలల్లో ఉండవలసిందే.

సంఘర్షణయుగపు తరానికిచెందిన నేను స్వాతంత్ర్యయుగపు తరానికిచెందిన యువకుణ్ని ప్రశ్నించాను "నీకేంకావాలి?". అతను చాలాచెప్పాడు. కాని ఆ చెప్పినదాని సారాంశమంతా తనకేంకావాలో తెలియదని. ఉద్యోగం కావాలా? కావాలి! ఎలాంటి ఉద్యోగం? బాగా డబ్బు సంపాదించగలిగేది— ఇంజనీరో— మరేదో అట్లాంటిది! మరి నీకలాంటి వుద్యోగం యెందుకు దొరకడం లేదు? దేశమంతా లంచగొండితనంతో ఉన్నందువల్ల. మరి నువ్వు నీకోసం కోరేదీ అదేగా? ఏమో? ఇంగ్లీషు ఉండాలా? వద్దు! హిందీ రావాలా? అక్కర్లేదు? ఎందుకని? ఏమో? పెళ్లాం కావాలా? ఓ! ప్రేమించావా యెవరినన్నా? 'ఏమో?' నాకు తెలియదు. ప్రేమించిన యువతిని పెళ్లి చేసుకుంటావా? కట్నం ఇవ్వరుగా? కట్నం లేకపోతేనేమి? మరి మాచెల్లాయిపెళ్లికి మేంమాత్రం కట్నం ఇవ్వొద్దూ!

ఇలా అస్తవ్యస్తంగా ఉంటాయి ఈతరం యువకుని సమాధానాలు. ఈతరం యువకులు అసమానతల అంతస్తులన్నింటినీ సమూలంగా కూలద్రోసి, నవసమాజం నిర్మించాలన్న ప్రయత్నానికి బదులు, ఈ అంతస్తుల్లోనే ఏదో ఒక అంతస్తుమీద తమ స్థానాలను సురక్షితం చేసుకుని తిష్టవేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ధనికులకూ పేదలకూ మధ్యవుండే అసమానతలను రూపుమాపే కృషికి పూనుకోవడానికి బదులు ధనికుడుఇచ్చే కబళం, ముష్టిని సంపాదించుకుని జేబులో భద్రపరచుకుందామని ఉవ్విళ్లూరుతున్నాడు. మిగతా దేశమంతటితోనూ తాదాత్మ్యం చెందడానికిబదులు సమాజం నుంచి, సంఘంనుంచి పారిపోతున్నాడు కుళ్లను కడగడానికిబదులు ముక్కుమూసుకుని, ముఖం ప్రక్కకు తిప్పుకుంటున్నాడు.

సినిమా ప్రొడ్యూసర్లవెంటా, మంత్రులవెంటా, ఉన్నతాధికారులవెంటాపడి చెక్కభజనలు సాగిస్తూ తిరిగే యువకులు ఎంతమంది?

ఇవేవీ చేతగాని నిజాయితీపరులైన యువకులుకూడా లేకపోలేదు కాని, వాళ్లల్లోకూడా చాలా మంది పలాయనవాదాన్ని అనుసరిస్తున్నారు. ఏమీ చెయ్యలేక చెయ్యలేమేమోనన్న భయంతో........ విసిగిపోయి. విసుగును వ్యక్తంచెయ్యడం చేత

గాక ముసుగుతన్ని నిద్రపోతున్నారు. నిద్ర పట్టనప్పుడు మత్తు పదార్థాల సేవనాన్ని ఆశ్రయిస్తున్నారు. ఇన్ని ఉద్యమాలు జరుగుతున్నా, ఇంత ప్రభుత్వ ఆస్తికి నష్టం వాటిల్లుతున్నా, బస్సులు, రైళ్ల నిలిచిపోతున్నా—— ఈ అన్నింటినీ చేస్తున్నవారు "మాకు ఏరాజకీయ పార్టీతో సంబాధం లేదు" అని సగర్వంగా చెప్పుకుంటున్నారంటే ఎంత భ్రమలలో ఉన్నారో తెలుస్తుంది. ఒక లక్ష్యాన్ని సాధించడానికి కృషిచెయ్యడం, సునిశ్చితమైన లక్ష్యంతో కార్యక్రమాలు సాగించడాన్ని ప్రతిష్ఠాకర విషయంగా వీరు భావించడంలేదు. సునిశ్చితమైన లక్ష్యంతో కృషిచెయ్యడం ప్రతిష్ఠాకరంగా భావించ నందువల్ల ఈ యువతరానికి లక్ష్యమేలేకుండా పోయింది. ఆరాటపడటం వున్నదిగాని ఆ ఆరాటం యెందుకో తెలియదు. తిరుగుబాటు చేస్తున్నామనుకుంటున్న యీ యువ తరాన్ని అడగిచూడండి మీకు ఏంగావాలని? ఏమీ తెలియదు. ఉన్నవ్యవస్థ మారాలా? తెలియదు. కొత్తవ్యవస్థ రావాలా? తెలియదు. వస్తే ఆ వచ్చే క్రొత్తవ్యవస్థ రూపం ఎలావుండాలో తెలియదు. సునిశ్చితమైన లక్ష్యంతో, నిర్విచితమైనదిశకు పయనించా లని నేను అంటున్నప్పుడు ఆ లక్ష్యంగానీ, దిశగానీ పాజిటివ్‌గా సకారాత్మకంగామాత్రమే ఉండాలని నేను కోరడంలేదు. నకారాత్మకంగా ఉండినా ఉండవచ్చు. ఏదికావాలో తెలియకపోతే పోయింది; కనీసం ఏదివద్దో అదన్నా తెలియాలి; దేన్ని నిర్మించాలో తెలియకపోతే పోయింది కనీసం దేన్ని కూల్చాలో దేన్ని నిర్మూలించాలో అదన్నా తెలిసివుండాలి.

ఇప్పుడుదేశంలో నూతన సమాజ నిర్మాణానికి, నవయుగ స్థాపనకు కృషి చేస్తున్న ఈ రాజకీయ పార్టీల లక్ష్యాలతోగాని, సిద్ధాంతాలతోగాని, ఈ సంఘం లేదా ఉద్యమం కార్యక్రమాలతోగాని వీరికి ఏకీభావం లేకపోతే లేదని స్పష్టంగా చెప్పగలిగి ఏ సిద్ధాంతాలు, ఏ లక్ష్యాలకోసం, ఏ రకమైనకృషి, ఏ కార్యక్రమాలద్వారా సాధించ దలచుకున్నారో యువతరం మనస్సుల్లో స్పష్టంగా వుండాలి. ఈ స్పష్టత సామూహిక స్పష్టతేకావాలనికూడా లేదు; తిరుగుబాటు చేస్తున్న ఏకాకి యువకుడైనాసరే, అతనికి తాను ఆకాంక్షిస్తున్న దేమిటో తెలిసివుండాలె.

సునిశ్చితమైన లక్ష్యాలతో కృషిచెయ్యడం ప్రతిష్ఠాకరంగా భావించినప్పుడు, సంఘం నుంచి, చుట్టూవున్న పరిసరాలనుంచి పారిపోవడం మానివేసినప్పుడు ఈ యువతరం తిరుగుబాటు చెయ్యడానికి పూనుకుని, నిరంతర శాసనోల్లంఘన ఉద్యమ మార్గాన్ని మార్టిన్ లూథర్ కింగ్‌లాగా అనుసరించిననాడు, బాధలనూ, కష్టాలనూ సహించి అయినాసరే లక్ష్యసిద్ధికై నిరంతరం పోరాడటానికి సన్నద్ధమైననాడు ఈ దేశానికి మంచి రోజులు రాగలవు— నేటి యువతరం మీద అలాంటి ఆశలు పెట్టుకోవచ్చును అనుకునే అవకాశం యిప్పట్లో కనపట్టంలేదు. ముమ్ముందు కనపడవచ్చునన్న ఆశను మాత్రం సాహిత్యంలో తిరుగుబాటు లేవదీసిన యువతరంవారు కలుగజేస్తున్నారు.

రెండు ఉర్దూ కవితలు :

## షబ్నం

'షాద్'

తోటలో మత్తునిద్రలో ఉన్న మొగ్గలను
మంచు మేల్కొల్పి
తెల్లవార వాని మొగాలు కడిగి
స్నానం చేయించి సింగారించి వెళ్ళిపోయింది.
తాను ఉన్నంతసేపు తోటలో కన్నీరు కారుస్తూనేవున్నా
మొగ్గలకు మాత్రం చిరునవ్వు ప్రసాదించి పోయింది.
తాను ఉన్నంతసేపు అందరికీ తాజాతనాన్నిస్తూ
అందరినీ నవ్విస్తూ వెళ్లిపోయింది
చీకటిలో వచ్చి
తెల్లవారకుండగానే వెళ్ళింది
ఎప్పుడు వచ్చిందో ఎప్పుడు వెళ్ళిందో
ఎవరికీ తెలియనే తెలియదు
దానికి దొరికిన జీవనం ముత్తెమంతది
కాని అంతలోనే యితరులకు మేలుచేసిపోయింది.
తోటలో ఉన్నది ఒకటి రెండు క్షణాలే
కాని అంతటిలోనే తోటను
ఎంతటిదాన్నిగా చేసిపోయింది
ఇంతకూ తోటనుంచి దానికేమీ లభించలేదు
అయినా తన సర్వస్వం దానిపై వెచ్చించిపోయింది.
తన ఆర్ద్రతనంతా తోటపై ధారపోసి
తోటను శోభింపచేసి వెళ్ళిపోయింది.
సూర్యకిరణపు పిలుపందగనే

మురుస్తూ మెరుస్తూ ఆవిరయిపోయింది.
ఒకటి రెండు క్షణాల్లోనే
కన్నీళ్లు కారుస్తూనే
పీడిపోయినా
దానికి దుఃఖం ఏమాత్రంలేదు;
కర్తవ్యాన్ని నెరవేర్చింది కనుక.

(అను: నారాయణరావు)

## గుమస్తా గోరీపై.

అమీఖ్ హన్ఫీ

మృత నగరంలోని ఏకాంతపు ఒక మూల
ఒక బొక్కలాంటి మట్టి సమాధి వున్నది.
అక్కడ ఒక చెక్కని రాయిపైన ఇట్లా రాసివున్నది
"ఇక్కడ ఒక పేద గుమస్తా నిద్రిస్తున్నాడు.
ఫైలయింది యాక్షన్ ఏమీ డ్యూ లేదు."

తమిళ కవిత :

## స్థితి

కా నా సుబ్రిమణ్యమ్

ఉపనిషత్తులను టి. ఎస్. ఇలియట్
పరిచయం చేసాడు;
టాగోర్‌ను యేట్స్;
భారతీయ సంస్కృతిని

మాక్స్ ముల్లర్
(తర్వాత భవన్)
భారతీయ నాట్యాన్ని బోపర్స్;
భారతీయ కళ నెవరు పరిచయంచేసారు
ఆయన పేరేమిటి
తమిళ క్లాసిక్స్‌ను డ్యానిలో
( లేక పోప్ ? ) ;

కండ లేదు చేవ లేదు
నెత్తురు లేదు శక్తి లేదు
ఆటవిక జాతి చిహ్నం.
కక్కేసే ఆలోచనలు
తనవి కావు.
మాటల్లో వాగ్ధాటి
తనవి కావు.
( కాలం అట్లా ఆదేశించింది.... )

కాశ్మీరీ కవిత :

## తోటమాలీ రా

మూలం : మహజూర్

ఆంగ్లం : త్రిలోకినాథ్ రాయినా.

తోటమాలీ, రా, వసంతశోభను సృష్టించు
పువ్వులు వికసించేట్లు బుల్‌బుల్ పాడేట్లు చెయ్
వాటికి ప్రేరణ కల్పించు.

నీ తోట శిథిలమై పోయింది:
మంచు ఏడుస్తున్నది. తమ దుస్తులు చినిగి
పువ్వులు చెదరిపోయినవి:

నిర్జీవమైపోయిన పువ్వులోకీ బుల్‌బుల్ లోకీ
మళ్ళీ ప్రాణాల్ని ఊదు.

కలుపు దట్టంగా పెరిగి
నీ గులాబీలను పెరుగనివ్వడం లేదు,
లేకపోతే, చూడు, గేటుదగ్గర
వేలకొద్ది పిచ్చి పూలు గుమికూడుతున్నాయి.

పంజరంలో బంధించబడ్డ పక్షి పరితపిస్తున్నది
దాన్ని ఎవరు వదులుతారు?
నీ చేతులతోనే దాన్ని త్వరగా విడిపించు.

ధనమూ, టీవీ, సుఖమూ, సౌకర్యమూ
రాజరికమూ, అధికారమూ, శాసనమూ— అన్నీ నీవే.
మేలుకో. నిద్రితుడా
ఇవన్నీ నీవని తెలుసుకోడానికి.

నీ తియ్యటి పాటలకు వీడ్కోలు చెప్పు
ఈ పూలతోటను లేపడానికి
తుఫాను సృష్టించు.
పిడుగులు గర్జించనీ.... భూకంపం రానీ.

ఇంగ్లీషు కవిత :

## అనామక వీధి

కేకి ఎన్. దరువాలా,

అక్కడ ఆక్రమణ అన్నమాట లేదు
ట్రాఫిక్, దుమ్ము, రాత్రి అన్నిటికీ ఈ తోవమీద హక్కు వున్నది.
గాలి తొందర తొందరగా చిన్న చిన్న అడుగులువేస్తూ
తాజా నీలివారవలె సాగిపోతుంది!

కాలి నడకవాళ్ళ తొందర, కలానికి చాతకాదు చెప్పడం
వాళ్ళకి ఒక శరీరం, ఒక పేరు
అంతరాంతరాల్లో దాగిన ఒక స్వప్నం, బహుశా, వున్నాయి :

ఆ వీధి ఒక నిరంతర విసర్జన.
బరువైన ఎగశ్వాస.
చీకట్లూ నియోన్ లైట్లూ
అక్కడలేని కాంతికోసం పోటీపడుతాయి.
వేశ్యా- బాల్కనీలమీద వేలాడుతున్న దీపాలు
తమ పక్కనున్న పాలిపోయిన చూపుల్ని వెలిగించలేవు:
వచ్చిపోయే ఆగంతకుల అనామకమయిన మెట్లవైపు
ఆ చూపులు— కోర్కెతో కాదు లొంగుబాటుతో.

ఆ వీధి ఒక వేదాంతి — అన్నింటినీ జీర్ణించుకుంటుంది :
రోడ్డువెంబడి ఊడ్చిపారేసిన చెత్తా చెదారాన్ని,
కెఫే ఎర్రరాతి మోహాన్ని,
అంబులెన్స్ సైరన్‌ను,
వికారంగా పెదవులు సాగదీసి బలవంతంగా పళ్లికిలించడాల్నీ;
తుంటరి పిల్లలు సతాయించే నాగ సాధువునూ
క్రీనీడల్లో కన్యలను అమ్మేవాళ్లనూ ;
ఆ వీధి అన్నింటినీ తూర్పు దేశాలవలె జీర్ణించు కుంటుంది.
అన్ని ఆవేశాలనూ ఆలింగనం చేసుకొనే
ఆవేశరహిత హిందూమతం వలె ;

[అమీఖ్ హన్ఫీ ఉర్దూ కవిత మొదలుకొని ఈ నాలుగు కవితలు Poetry India, ఏప్రిల్ — జూన్ '66 సౌజన్యంతో.]

కన్నడ కవిత :

# భవిష్యత్తులోకి-

వి. సీతారామయ్య.

ఇంగ్లీషు అనువాదం : వి. కె. గోకాక్.

సాటిలేని సహజ గౌరవంతో పుట్టారు మీరు
మేమో, మా పాపాలు ఎన్ని తీర్లవవి !
ఈ సుదీర్ఘ పథంలో వెతుక్కోవాలి.
నీడ లేదు, చెప్పుకోలేని చింత మాత్రం వున్నది.
ఇక్కడ మన సాహచర్యం ముగుస్తుంది.
ఆసరాలూ, ఆశలూ యిచ్చి పుచ్చుకోవడమింక లేదు.
మనం మిత్రులుగా వుంటిమవే విశ్వాసం
యిక్కడ తెగిపోతుంది.
మన మార్గాలు చీలిపోయాయి
లక్ష్యమూ, అవకాశాలూనూ.
నాలుక యీమాట యింకా పెదవులదాకా
చేర్చ లేదేమోకాని
మన హృదయాలకు తెలుసు
బెడిసిందని,
తోవే యెలుగై మమ్ములను పిలుస్తున్నది.
విశ్రాంతి లేదు మేము సాగిపోవాల్సిందే
వొడిచిపోని యీ బాటలోని బాధలూ, భారాలూ
వోర్చుకోవాల్సిందే.
ఆ తరువాత యేమవుతుందోకూడ ఆలోచించలేము
మీది, ఆడుతూ గడచిన రాజమార్గం
నవ్వుతూ పోయారు, కానీ లే

ముళ్లతో రాళ్లతో పరచబడిన
మా మార్గాన్ని డొంకలబాట అంటున్నారు
అయినా మాతోవ అదే.
మీకిక్కడ శాంతి వున్నది
మీరు అదృష్టవంతులు.
మీ ప్రయాణం అయిపోయింది.
కాని మేమిప్పుడు మా మార్గాన్ని నిర్వచించాలి
దాని వొంకల్నీ. విశాలత్వాన్నీ సైతం.
మా బాట బాధతో నిండింది
వొంటరితనంచేత శపించబడింది
మా కళ్లనుంచి నీళ్లుకావు రక్తం స్రవిస్తున్నది
అంతులేని రక్తం.
మా యాత్ర యెప్పుడూ ముగియదు
అయినా మేం అలసిపోం.
యిదివరకు స్నేహం స్వచ్ఛంగా పచ్చగా వున్నచోట
ఆనందమనే చిగురు, ఫలించినచోట
యిప్పుడు జ్ఞాపకాలను చీల్చివేస్తూ
విషాదాలు రెమ్మ వేస్తున్నాయి.
మా తోవ వెంబడి వెక్కిరింపులుకూడ నడుస్తున్నాయి.

యివ్వాళ మేము క్రాస్‌రోడ్స్ దగ్గర వున్నాం.
యిదివరలో వలెనే మనం మిత్రులుగా
వుంటే బాగానేవుండేది. యెంత అదృష్టం!
చీలిపోతున్న బాటలు కలుసుకుంటే
చక్కగా వుంటుంది స్వర్గం దిగివచ్చినట్లు.
కాని వీల్లేదు
మనం విడిపోక తప్పదు.
యెవరి యేకాంతమార్గాన వాళ్లం
వెళ్లిపోక తప్పదు.

సంస్కృత కవిత :

## సూర్యుడు

ఋగ్వేదం – మండల 1, గీతం 79లో I భాగానికి
ఇంగ్లీషునుంచి అనువాదం. ఇంగ్లీషు– పి. లాల్.

సత్త్వవంతుడు, సత్యవంతుడు
స్వర్ణకేశ సర్వాన్ని వెలిగించేవాడు
ఆకాశ మార్గంగా నవ్వుతూ వస్తాడు
ఆయన ఉదయాన్ని కనిపెట్టే కాంతి కామందు.

మబ్బులు ఉరిమి, మంచుపొగ చెదరి
నల్ల కోడె రంకె వేస్తుంది,
అందాల రెక్కల పక్షులు సిగ్గులు విసురుతాయి
వర్షాంగన వసుధమీద వాలుతుంది.
మధుర క్షీరాలతో స్తనభార వలె
ఆకాశం గర్భం నిండుతుంది
మేఘాలు నేల నడుముచుట్టూ
పెనవేసు కుంటాయి
ఆయన ఆకాశ మార్గాన నవ్వుతూ వస్తాడు.

[ పైకవితలు రెండూ The Illustrated weekly of India సౌజన్యంతో ]

గుజరాతీ కవిత :

# సుత్తె పైకెత్తు

సుందరం.

చెయ్యి, చూస్తావేం సుత్తె పైకెత్తు!
విరగ్గొట్టాల్సింది, బద్దలు గొట్టాల్సింది చాలా వుంది.
చూస్తావేం- దెబ్బమీద దెబ్బ- కొట్టు!
మానవ హృదయాల్లో పేరుకున్న
జడత్వాన్నీ, శైథిల్యాన్నీ
ఛీకొట్టి, తరిమి కొట్టు!
ధరాతలం కదలగ,
దశదిశలూ గడగడ వణకగ,
నభోమండలంపై ప్రకంపం పరివ్యాప్తి చెందగ!

హృదయంలో, ఉదరంలో,
అలలు అలలుగా, భయం వ్యాపిస్తోంది.
మిన్ను విరిగి మీద పడ్డా,
భూమిపుట్టి మునిగిపోయినా,
సుత్తె పైకెత్తి
స్పృహతప్పి పోయేట్టు-
దెబ్బమీద దెబ్బ కొట్టు, నా భుజమా!!
యుగ యుగాలనించి
పేరుకొన్న కాలుష్యాల పొరలపై
లంకించి దెబ్బ తీయ్—
పాతాళం పూర్తిగా బ్రద్దలవాలి
భూతలం భయంతో మూర్ఛిల్లిపోవాలి.

ప్రచండ జ్వాలాముఖి,
బహిర్గతమై,
రౌద్రిం పూత్కరించి,
విలయ తాండవం చేయాలి.
వెదికి, వెదికి
(బరువుకి కట్టిన)
పాత మోకుని తెగకొట్టు!
కొట్టి కొట్టి
కొత్త ఆకారంతెచ్చి తెచ్చి
నిరంతరం సుత్తెని ఎత్తిపట్టి,
లోకానికి— నా భుజమా!
కొత్త దనం ప్రసాదించు!!

(అను: నిర్మలానంద)

బెంగాలీ (ఆకలితరం) కవిత :

## కవిత నన్ను క్షమించదు

దేవీరాయ్.

అతి నీ- ర- సం- గా దొర్లుతూ రోజు
ఏ విధమయిన సంఘటనగాని దుర్ఘటనగాని జరుగదు.
దాని వీపుమీద కూర్చొని
నగరంలో బజార్లన్నీ తిరిగివద్దును.
అయినా బయటికి వెళ్లక తప్పదు
నా తలమీద మోపిన బరువునంతా
అమ్మిరాక తప్పదు.
నా ఆత్మకౌరకు వ్యంగ్యంతప్ప ఇంకేమున్నదని?
ఎన్నడో ఓనాడు నేనుకూడ (అందరివలెనే)
ఎక్కడో నన్ను పోగొట్టుకుంటాను.
నాకనిపిస్తుంది
అప్పుడు
కవిత నన్ను క్షమించదు.

(అను: నిర్మలానంద)

హిందీ (అతిథి) కవిత :

## "ఓ లీడర్"!

ప్రభాకర్ మాచవే

ఓ లీడర్ !
నువ్వు
నాకళ్లనీ చేతుల్నీ గట్టిగా బంధించి
పరిగెత్తు పరిగెత్తు అని ప్రవచిస్తావు.
రెండుగా కత్తిరించి నా నాల్కని
దండిగా ఉపన్యసించ మంటావు.
నా 'సులోచనాల'ను కాస్తా దొంగిలించి
చదువు, చదువు! అని ప్రబోధిస్తావు,
నేను శూద్రుణ్ణి, వేదం విన్నానని
నాచెవుల్లో సీసం కరిగించి పోశావు.
నగ్న 'అనసూయ' ను నేనెక్కడ చూస్తానోఅని
నా కనుల్ని మండేలోహ శలాకల్తో అద్దినావు,

నువ్వు మహానుభావుడివి
సర్వ శక్తిమంతుడివి.
నేనో
వట్టి బలిపశువును!
దరిద్రుణ్ణి;
ఇంకా వింటావెందుకు
ఈనా దుఃఖభరిత విలాపాన్ని.
పడనీ! నామెడమీద కత్తిని
పదిచేతుల తల్లి ప్రసన్నకానీ.
ఓ లీడర్ !

(అను: వేన రెడ్డి)

సమీక్షలు :

# తృణకోణాలు

(కవితా సంకలనం సమీకర్త: మురళీధర్, ప్రతులకు, మురళీధర్ C/o టి. రాజేశ్వరరావు, కరెస్పాండెంట్ ఇండియన్ ఎక్స్‌ప్రెస్, వరంగల్-1 వెల: ఒకరూపాయి.)

---

ఈ రెండు మూడేళ్లలో కవితా సంకలనాలు విరివిగా వెలువడుతున్నాయి. ఒక్క వరంగల్ నగరంనుండే అయిదు కవితా సంకలనాలు వెలువడటం అక్కడియువ కవుల్లో వెల్లివిరుస్తున్న ఉత్సాహానికి నిదర్శనమని చెప్పవచ్చు 'తృణకోణాలు' ఈ మధ్య వరంగల్‌నుండి వెలువడిన కవితా సంకలనాలలో ఐదవది.

తృణకోణాలలోని క్రొత్తదనం— "ఇందులో చాలావరకు పాఠకలోకానికి అనామకంగా ఉన్న కవుల, కవయిత్రుల కవితలే తీసుకోవటం జరిగింది, అదే ఈ సంకలనం యొక్క ముఖ్యోద్దేశంకూడా." అంటే ఈ సంకలనంలో వినిపించే కవి గొంతులన్నీ సరికొత్త గొంతులేనన్నమాట. ఏవో కారణాలవల్ల పాఠకలోకానికి అనామకంగా ఉన్న కవులకు ఈ తృణకోణాలు ఒక వేదిక కల్పించింది. ఇది నిజంగా శ్లాఘనీయమైన ప్రయత్నము. "తృణప్రాయమంత విలువగాని, ప్రయోజనంగాని ఈ సంకలనానికి లభిస్తే, ఈ తృణకోణాలు ధన్యతచెందినట్లే" అని చాలా వినయంగా చెప్పుకున్నారు ఈ సంకలన సమీకర్త మురళీధర్. తృణకోణాలు సమీకర్త ఆశించిన ప్రయోజనంకంటే ఎక్కువే సాధించింది.

ఈ సంకలనంలో పదముగ్గురు కవుల కవితలున్నాయి. ఈ పదముగ్గురిలోకి ముగ్గురు కవుల్ని ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు. ఈ ముగ్గురు కవులు సరియైన ప్రోత్సాహములభిస్తే ముందు ముందు మంచి కవిత్వము వ్రాయగలరనే ఆశ 'తృణకోణాల' లోని వారి కవితలవల్ల కలుగుతుంది. ఈ ముగ్గురు- రోహిణి, పురుషోత్తం, వేముల శంకర్. నేటి సమాజంపట్ల యువ కవుల్లో పేరుకొన్న అసంతృప్తి, ఆవేదన ఈ ముగ్గురి కవితలోను కనిపిస్తుంది.

"చిచ్చుబుడ్డిలా వెలగటంలేదు
సిసింద్రిలా ఎగరటంలేదు
సీమటపాకాయలా పేలటంలేదు
సిగరెట్టులా తగలబడిపోతుంది ప్రతిగుండె"

అంటుంది "రోహిణి" దీపావళినాటి రాత్రిని వర్ణిస్తూ.

కవిత్వం అంటే ఏమిటో చెబుతూ పురుషోత్తం:

"ప్రబంధ శృంగారానికి మరోసారి అభివర్ణనం
కావద్దు కవీ నీకవితకు నిర్వచనం
ఇది పోతనల, శ్రీనాధులకు వంతపాడే కాలంకాదు
చేతనలు మనాదుల, చింతలతో కూడివున్న కాలంఇది
పోషించటానికి రాజులేడని చింతించకు
భూషించటానికి దుశ్శాలువ తేలేదని చింతించకు"

అంటాడు.

నేటి సమాజంలో రోజురోజుకు వేళ్ల తన్నుకుపోతున్న స్వార్థాన్ని, కుళ్లను దగాను, లంచగొండితనాన్ని గొప్పగా చిత్రించాడు వేముల శంకర్ తన 'పరేశాని' అనే గీతంలో.

"ధనం మోక్షాన్ని పంచిపెడుతుంటే
దేవుడు తెల్ల మొఖం వేసుకుని చూచీ చూచీ
ఇక లాభం లేదని తనూ నిల్చున్నాడు "క్యూ" లో
ధరలు మబ్బుల చాటునుండి అధరాలు అందిస్తుంటే
పీటలపై పీటలు వేసుకుని అందుకోలేక
గుక్కిళ్ల మింగుతున్నాడు సామాన్యుడు
విటమిన్ 'యమ్, యండ్ రికమండేషన్లు నిర్వహించిన రన్నింగ్‌రేస్‌లో
గుఱ్ఱాలకన్నా గాడిదలు ఫస్టొచ్చాయి
ప్రాణం తీయటానికి వచ్చిన యమధర్మరాజుకు లంచంయిచ్చి
మంచం వేసుకొని హాయిగా నిద్రపోయాడు జీవుడు."

అంటాడు వేముల శంకర్. చక్కని ధ్వని, బలమైన భావం, స్పష్టమైన వ్యక్తీకరణ, నిజమైన ఆవేదన పుష్కలంగా ఉన్న ఈ గీతం తృణకోణాల్లోని కవిః ˆకలా తలమానికం.

వీరు ముగ్గురేకాక మిగతాకవుల కవితల్లోను అక్కడక్కడ కవిత్వపు మెరపులు కనిపిస్తాయి.

## చైతన్య భారతి

[కవితల కదంబం: వెల: రూపాయిన్నర; ప్రతులకు M/s ప్రగతి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3–4–219, లింగంపల్లి, హైదరాబాదు–27.]

చైతన్యభారతి ఆంధ్రి రాజధానినుండి వెలువడిన "కవితల కదంబం." ఈ సంకలనంలో దర్శనమిచ్చే కవులు చాలావరకు పాఠకలోకానికి చిరపరిచితులే.

ఈ సంకలనంలోని మొదటి గీతం వరవరరావు రచించిన 'గ్రీష్మ గీతం' నిజంగా ఈ సంకలనానికి మొదటి గీతమే. తన దేశస్వాతంత్ర్య పరిరక్షణ కోసం ప్రపంచంలోకల్లా అతి శక్తివంతమైన దేశంతో ఒక రెండు దశాబ్దాలుగా మహోజ్వల పోరాటాన్ని సాగిస్తున్న వియట్ కాంగ్ గెరిల్లా ప్రపంచంలోని అన్ని దేశాల మేధావుల్లో కవులలో, కళాకారులలో గొప్ప ఆవేశాన్ని సృష్టించాడు. చాలాకాలంగా సామ్రాజ్య వాద దేశాల గుప్పిటిలో నలిగిపోయిన ఆశియా, ఆఫ్రికాదేశాల పేదప్రజల గుండెల్లోకి కొత్త జీవాన్ని, కొత్త రక్తాన్ని, కొత్త ఆవేశాన్ని, స్వాతంత్ర్య రక్షణపట్ల గొప్ప సంకల్ప బలాన్ని పంపిస్తున్నాడు వియట్ కాంగ్ గెరిల్లా. ఆ వియట్ కాంగ్ గెరిల్లాకి ఈనాటికి ఒక తెలుగు యువకవి ఇలా జోహార్లు అర్పిస్తున్నాడు:

"ఈగిల్ ముక్కులో ఇంపీరియలిస్టులు
నింపిన విషాన్ని
డాలరు డొక్కలో దమన రాజనీతి
దాచిన కల్మశాన్ని
కడిగేసిన, కక్కించిన, క్రాంతిమంతుడా
నీపిల్లలు నిర్భయాన్ని చదువుకుంటున్నారు
నీతల్లులు నిర్మమత పొదవుకుంటున్నారు
నీప్రియురాలు స్వేచ్ఛకోరే నెత్తురుతో
నీకెప్పుడూ ప్రేమలేఖలు రాస్తూనే వుంటుంది
నిన్నుచూచి యుద్ధం సిగ్గు తెచ్చుకుంటుంది"

తర్వాత చెప్పుకోతగ్గ మంచిగేయాలు "విద్యుద్గీత" (అమ్మంగి వేణుగోపాల్) "సుప్తచిత్రాలు" (వేగుంట మోహనప్రసాద్) "ప్రపంచయుద్ధంలో అంతిమవిజయం" (అద్దేపల్లి రామమోహన్‌రావు) "సడిలేని సంకెళ్లు" (సానికొమ్ము క్రిష్టారెడ్డి) "ఔట్ ఆఫ్ సిలబస్" (పేర్వారం జగన్నాథం). ఈ ఖండికలన్నీ నేటి తెలుగు స్వచ్ఛందకవిత పొందుతున్న వివిధ రూపాలకు మచ్చుతునకలనవచ్చు.

—నవీన్.

## స్రోతస్విని

[ రచన: శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి, శ్రీ ముదిగొండ వీరభద్రయ్య, పుటలు 112, వెల: రూ. 2/– ప్రతులకు: రచయితలు, ప్రభుత్వ కళాశాల, సిద్దిపేట, మెదకు జిల్లా )

---

ఇందులో మొత్తం 30 ఘూర్ణికలు ఉన్నవి. శ్రీ పరాశరంగారివి 15, శ్రీ ముదిగొండగారివి 15 ఖండికలు. దేనికది వేరువేరుగా వున్నది. ఈముప్పై ఖండికల్లో ఏ ఒక్కటిచదివినా రచయితల ఆటవిక యుగంనాటి మనస్తత్వం తెలుస్తుంది కాని ఆధునికత్వం ఉన్నట్లు అగుపించదు. ఈ కావ్యం గంగా యమునలు కలిసి జమిలిగా పారుతున్న పుణ్యస్రోతస్విని అన్నంతపోజు ఈ రచయితలకుండడం బాధాకరం. ఇదొక సైడుకాల్వ. ఒక మంచి భావం, ఒక మంచి ఆలోచన ఎక్కడైనా కనిపిస్తుందేమోనని కావ్యమంతా కళ్ల దివ్వెలు వెలిగించుకుని చూశాను కనుక ఇలా రాయక తప్పిందికాదు.

'ఏప్రక్రియనైనా ప్రతిభకలవాడు చక్కగా పలికిస్తాడు. నిర్వచనాలు చేయడం మొదలుపెట్టితే ప్రతిభపాలుకంటే వ్యుత్పత్తి కర్కశత్వం పెరిగిపోతుంది'— మరి ఈ రచయితలు కనీసం ఈ నియమాన్నయినా పాటించారా? డార్విన్, ఫ్రాయిడ్, [illegible]క్స్, ఐన్‌స్టీన్ సిదాంత రాద్ధాంతాలవల్ల ఆర్థిక, సాంఘిక, రాజకీయ, పారిశ్రామిక విప్లవాలనేకం వచ్చాయి. వీటిమూలంగా ప్రపంచ చరిత్రగతి మారుతూవున్నది. సాహిత్యంలో, శాస్త్రంలో అన్నింటిలో అనేక మార్పులు చేర్పులు వచ్చాయి. వీటన్నింటిఫలితంగానే కర్కశత్వంనుంచి, పాండిత్య ప్రకర్షనుంచి, ఛందస్సర్పాల నుంచి, అలంకారాల అంబారీలను తొలగించి సహజ సుందరంగా తయారై మానవుని ఆలోచనలకి, అనుభూతులకి ముడివేయడానికే వచన కవిత అవతరించింది కాని పాత

సారాను కొత్తసీసాలోపోసి స్వచ్ఛందకవిత ట్రేడుమార్కు వేసి ఇదో నవ్యత అనడానికి కాదు. యుద్ధాలు విప్లవాలు రాజకీయ సిద్ధాంతాలు వచనకవిత్వంమొగాన ప్రొద్దుపొడి పించినవని ఏ వచనకవీ అనలేదని రచయితలు గుర్తిస్తేచాలు! వచనకవిత అంటే సరిగ్గా తెలియని వీరు వచనకవిత రాయడం దేనికో? ఛందఃపాషాణాల్ని మలిచేకంటే వచన కవిత్వంలో ఒక సౌలభ్యం సౌందర్యం వున్నదనిన్నీ, మరుగుతున్న ఆలోచనల్ని ఛందస్సుల మూసలలోపోసే ఓర్పులేనివారే వచనకవిత్వం వ్రాస్తారనే దురభిప్రాయం కూడా వీరికుంది. వచనకవితపై యిన్ని అభిప్రాయభేదాలు పెట్టుకొని వచనకవితనే యెందుకు ఆశ్రయించారో వీరు.

ఇవి పద్యాలు కావు, గద్యాలు కావు— కనీసం హృద్యాలుకూడా కావు, మరేమిటి? పద్యాలు గద్యాలుకాని వచనకవిత అనే misunderstanding వీరికున్నది. ఇది కేవలం దబాయింపుమాత్రమే. శ్రీ ముదిగొండగారివి వచనగేయాలు అనవచ్చు-కాని పరాశరంగారివి మాత్రం గేయాలే. కవిత్వం రాయడానికి ప్రతిభ, వ్యుత్పత్తి, సాధనతోపాటు క్షణక్షణానికి మారుతున్న లోకంగురించిన అవగాహనకావాలి. వీటన్నిటి కంటే ముఖ్యంగా కవికి హృదయం కావాలి; హృదయానికి కావలసినంత అనుభూతి కావాలి. ఆలోచనల్లో స్పష్టతపెరగాలి. అప్పుడే క క క క క క కా ల ల ల ల ల ల లా (వివేకామృతం—పరాశరు) అనే నత్తిమాటలురాసినా కవిత్వమవుతుంది. ఏదీలేకుండా అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదలితే లాభంలేదు

ఇందులో విషయంలేదు. అమృతం అంతకంటేలేదు. ఈయనకవిత్వంలో (అప) హాస్యం అరవైపాళ్లు. కవిత్వం ఆరుపాళ్లు. రెండు పంక్తులు రాస్తాడో లేదో సామెతలు, లోకోక్తులు చెప్తాడు. కవిత్వంసంగతి మరిచిపోతాడు. రాముడు కృష్ణుడు పుట్టినభూమిలో రామకృష్ణులే పుడుతారని ఈయన నమ్మిక. ఈయన కవిత్వంలో కర్మ సిద్ధాంతాల భయం చాలావుంది.

ఈకవిపైన ఏ 'యిజం' ప్రభావం లేకపోవడం హర్షించదగిందే! కాని అంత కంటే ఘోరమైంది మతంపిచ్చి వున్నట్లుగా కావ్యమంతా ధ్వనిస్తూనేవుంది. ఇన్నాళ్ళ తర్వాతకూడా పరమతసహనం లేకపోవడం క్షమించరాని విషయం.

'చరిత్రకారులు' అనే ఖండికలో 'కిరస్తానీపైగంబరు బోధిస్తూవుంటే అరస్తా మీద్దనే పండిలేచిన శంకరయ్య బౌద్ధుల అద్వైతం మాయజేసి కాజేసాడు' అని అంటాడు. వచనకవిత రాస్తున్నా భావానికిపొసగని పదాలను కేవలం ప్రాసకోసం వెతికివెతికి తెచ్చి వేయడం, వాక్యాల్ని విరచడం స్వచ్ఛంద కవితాధర్మంకాదు.

ఆధునిక కవి వినూత్నమైనపదాల్ని, భావాల్ని నేటి సమాజంలోంచి ఏరుకోవాలి. వీరి కవిత్వంలో అయోమయం, గందరగోళం ఎక్కువైంది. చాలావాటిల్లో సాంకేతిక పదజాలం ఎక్కువై, కవిత్వానికి ప్రధానమైన అనుభూతి దెబ్బతిని, భావవ్యక్తీకరణ జరిగకపోగా, అన్వయ కాఠిన్యత ఎక్కువైంది. 'చాంద్రమానం' 'అమాంతం'అను ఖండికల్లో అస్పష్టత యెక్కువగా వుంది. 'నక్షత్రాయణం' లో చెప్పదల్చుకున్న దేమిటో తెలీదుకాని యీయనకు ఆగమ, అలంకార శాస్త్రాలలో, ఖగోళశాస్త్రంలో పరిజ్ఞానంమాత్రం వున్నట్లు తెలుస్తుంది. శాస్త్రజ్ఞానాన్ని తెల్పడానికి కవిత్వంరాయాలా? 'ఎర్రగీత' 'అశ్వమేధం' 'మరుభాష్యం' చౌకబారు రచనలు. 'అష్టగ్రహకూటం' వీరి వాదస్తానికి సంకేతం. 'నారాయణుని నమ్మకొని పౌరుషముతో పనులుచేయి' అని బోధిస్తాడు ఈ ఖండికలో. ఇదొక మాయావాదం. రచయితలోని బలహీనత. పౌరు షమూ, బుద్ధి ఉన్నవాడు ఎవ్వడూ మరొకనిపై ఆధారపడడు.

ఈయన రాసిన 15 ఖండికల్లో 'ఎన్నిక లెన్నిక లెన్నికలూ' 'మయసభ' అనేవి మాత్రం చెప్పుకోదగ్గవిగా వున్నవి. 'ఎన్నికల....' గేయంద్వారా యీ కవి సమాజాన్ని ఒక్కసారయినా పరిశీలనగా చూశాడనిపిస్తుంది. "ఎన్నికలే ఈ ఊళ్లో పంచవర్ష ప్రణాళికలు యిష్టంవచ్చినవాళ్లకి వోట్లేయవచ్చు మా ఇష్టమైనవాడికి వేయక పోతే వచ్చేవన్నీ కష్టాలే ఖబడ్దార్ జాగ్రత్త" అని వ్యంగ్యంగా హెచ్చరిస్తున్నాడు. "క్రిందటిసారి కంకరతోలాం మీదటసారి రోడ్డువేస్తాం ఈ ఒక్కసారి ఓటువేయండి" అని ఎన్నికలముందు వాగ్దానాలుచేసే ప్రజా (ప్రభుత్వ) స్వామ్య పాలకమ్మన్యులను ఎత్తిపొడుస్తున్నాడు, 'మయసభ' అనుపేరు నేటి సమాజపరిస్థితిని సూచించుటకు భావ గర్భితంగా పెట్టినపేరు, ఇందులో "ఆగలేని నరాంతక ఎక్స్‌ప్రెస్ బర్త్‌కంట్రోల్ విప రీతంగా చేస్తున్నది"అని నేటిప్రభుత్వపు తెలివితక్కువ దివాలాకోరుతనాన్నిచిత్రించాడు.

ఇక ఇందులో రెండవకవి శ్రీ ముదిగొండ వీరభద్రయ్య. ఇతనికి శ్రీ పరా శరంగారికంటే కవితాత్మ కొంచెం యెక్కువ. అర్థకాఠిన్యం లేదు. కాని అనుభూతి వున్నచోట ఆలోచనలుకుదరక ఆలోచనలున్నచోట అనుభూతి లేక కవిత్వం ఉప్పునీరు మంచినీరు కలిపినట్లుగాఉంది. 'నగరకాంత' ఒక్కటే ఈయనగీతాల్లో చెప్పుకోదగ్గది. ఇది హైదరాబా(ధ)దునుగురించి కవిగీసిన ఒక రఫ్‌స్కెచ్. ఇందులో కథా కథనం
౨. ఇదేగీతం 2వ భాగం 'డబుల్‌డెక్కర్' మరీ కృత్రిమంగా ఉంది. ఈయన (రచయిత) అదృష్టవశాత్తు ఒక అమ్మాయితో డబుల్‌డెక్కర్ క్రింది అంతస్తులో ప్రయాణంచేస్తాడు. హుసేన్‌సాగరం నీటిలోంచి చీకట్లు ఊరంతా ప్రసరిస్తున్నవి. ఆచీకట్లే ఆమె గాజుకళ్ళకి సరిహద్దులు. ఆమె 'ఏయ్‌మిష్టర్' భుజంమీదినుంచి చేయి

తీయి' అని అంటుంది. అంతలోనే అతను ఆమెపెదాల్ని కళ్ళతో ముద్దెట్టుకుంటాడు. క్లోరిన్‌లో వేసిన గులాబీపువ్వుల్లా వుంటవి ఆ పెదాలు. 'ఎక్కడ దిగుతున్నావు?' ఆమె ప్రశ్నిస్తుంది. 'ఎక్కడా దింపకపోతే డిపోకిపోతాను' అంటాడు. ఎందుకు? 'మోక్షము పొందడానికి' అంతలోనే ముందుగా వెళుతున్న కారువెనుక ఎర్రలైట్లు కనిపిస్తాయి. గతకాలముమేలు వచ్చుకాలము కంటెన్ అన్నట్లు. ఇలా సాగుతుంది శైలి. ఇదీ ఇతని ధోరణి. ఇతనికి భావదాస్యం బాగావుంది, భవిష్యత్తుపైన కొంచెంకూడ నమ్మకంలేని వాడు. ఇతని 'రేపు' అనే గీతంకూడా నిన్నటిసంగతుల్ని చెప్పినట్లుగాఉంది.చూడండి-

"క్రొవ్వొత్తి ముందరున్న సుందరవదనం
అది కరిగి ఆవిరవగానే నల్లనయింది
విరిసిన విరికన్నె రెక్కలెందుకో విరిగినవి"
"రేపీసమయంవరకు వాతావరణం
అతి భయంకరమని రేడియో ప్రసారం"

అందుకే ఇతనికి భవిష్యత్తు భయంకరంగా కనిపించింది. 'ఆకాశరామన్న' ఇతని మరోగీతం. ఆకాశరామన్న పేరవచ్చే ఉత్తరాల్ని దుయ్యబట్టాడు. ఈ ఆకాశ రామన్న మంచికంటే చెడే ఎక్కువ చేస్తున్నాడు. పూర్వం యెప్పుడో అన్యాయాలు, అక్రమాలు జరుగుతుంటేవాటిని రూపుమాపటానికి ఈ ఆకాశరామన్న ఉత్తరంముక్క అవతరించేవాడు. కాని యిప్పుడు ఈర్ష్యతో, జుగుప్సతో అవతరించి యిరువైచేతుల రావణకృత్యాన్ని ఇరువేళ్ళమధ్య కలంతో చేయరాని ఘోరాలు, నేరాలు చేస్తున్నాడు. అందుకే ఇతడు——

"అనాచార్యుడు! దురాచార్యుడు
మంచివాళ్ళ గుండెల్లో మంటపెట్టేవాడు
పూలవంటి జీవితానికి సొదపేర్చేవాడు"
"భువిమీద రాముడు ఒక్క సీతనేవిడిపించాడు
ఆకాశరాముడు సాధ్వులందర్నీ విడిపిస్తున్నాడు"

ఇతని 'జీవనస్రవంతి'లో కథాత్మకశైలిఉన్నా ఆత్మాశ్రియధోరణినిండిపోయి అసహ్యంగా తయారయింది. ఈయన ఆఖరిగీతం 'సప్తపది' చదివేసరికి ఇతనిపై పాఠకునికివున్న నమ్మకం కాస్త నీరుగారిపోతుంది.

—జలజాసన.

సంపుటి –3.

# దిగంబర కవులు-

దిగంబరకవుల 3వ సంపుటి 14–9–'68న, అర్ధరాత్రి కంచికచెర్ల కోటేశు స్మృతిచిహ్నంగా వెలువడింది. కథనవస్తువు, నేటి కుష్ఠువ్యవస్థ, ఈ సహచరకవుల కథావస్తువూ, రచనా శిల్పమూ యించుమించు ఒకేమూసపోతలో ఉంటుంది.

రాజకీయరంగంలోను, సినిమా పరిశ్రమలోను, సాహిత్య క్షేత్రంలోను, ఇతరత్ర నేటి సమాజంలో సాగుతున్న కృతక విలువల చలామణిని దిగంబర కవులు తమ రచనలద్వారా నిరసిస్తారు.

పార్టీలుమారే ఈ పగటివేంషగాళ్ళని
పదవీ భ్రష్టుల్నిచేసే
బహిరంగసభల్లో నిర్దయగా కాల్చేసే
తిరుగుబాటు యువతరాన్ని సమర్థించి తీరుతాను. —చెరబండరాజు.

స్వప్రయోజన పరత్వానికి, ధన పదవీవ్యామోహానికి, ఆశ్రిత పక్షపాతానికి ఆదర్శాలను బలిపెట్టే అవకాశవాద పెత్తందారీ దౌర్బల్యాలను అంతరాత్మ రాహిత్యాన్ని వీరు తీవ్రదూషణపదాలతో ధిక్కరిస్తారు.

ఒరేయ్, పేనుకుపెత్త నమిచ్చిన పెమ్మయ్యలూ
మీ ఒంటిమీద చర్మం బులబులాగ్గా ఒలిపించి
కారంపూసి నిప్పులమీద దొర్లించి
మిమ్మల్ని తింటానాగ్ర. —భైరవయ్య.

కుళ్లను కుహకాన్ని దూషణతో బట్టబయలుచేయడంద్వారా ఆదర్శవిలువలను, నిజాయితీని, న్యాయాన్ని ఉద్ధరించగలమని వీరు విశ్వసిస్తారు. కనుక మొరటుపదాలను వినియోగించటానికికూడా వెనుతీయరు. ప్రతీపశక్తులను 'హింస' ద్వారా ప్రతిఘటించే ధోరణిని వీరు పదవిన్యాసంలో అవలంబిస్తారు.

శూన్యంలోని శవాల్ని కాల్చి
ప్రాణంకోసం మళ్ళీ

పంచిపెట్టు హింసను
హింసలోంచివచ్చే స్వచ్ఛమైన ప్రేమను. —నిఖిలేశ్వర్.

ఈకోవకుచెందే చేదుకవితలు విఖ్యాతుడైన మాక్సిం గోర్కీ మున్నగువారు తమ లోవర్‌డెప్త్స్, డెడ్‌సోల్స్ మున్నగురచనలలో అవలంబించారు. కనుక దిగంబర కవుల రచనాధోరణులు నిషిద్ధమేమీకావు.

స్వాతంత్ర్యంపేర,
ప్రజాస్వామ్యంపేర,
నమ్మకద్రోహాన్ని
నిలువునా కాల్చు. —నగ్నముని

ముంగిట మౌనంగా మెరుస్తున్న
శస్త్రవైద్యుని పదునుకత్తులు
అనివార్యంగా ఆహ్వానిస్తున్నాయి
మెరుపుకత్తులు పురుటి కానుకలు
హింస విప్లవానికి మంత్రసాని. —జ్వాలాముఖి.

ఇలాంటికవితలో రసదృష్టికంటెభావస్ఫూర్తియే ఎక్కువ. రాజకీయసిద్ధాంతాల, వాద వివాదాలధోరణులు రచనలో గర్భితమైయుంటాయి.

తూర్పువేలి పగుల్తున్నచప్పుడు
ఎర్రుపై దగ్గరలో వినపడ్తున్నది
భరతవాక్యం బలంగా కనపడ్తున్నది. —జ్వాలాముఖి.

* * *

ఇంటిలో చావ నాశనం కావటానికి
వరద లెప్పుడోకానిరావు
మంట లెప్పుడోకాని పాకవు.

ఇలాంటి అనేక దిక్‌లలో విప్లవం, తిరుగుబాటును గూర్చిన ధ్వనిలక్షణాలు అగుపిస్తాయి. తీవ్ర వామపక్షధోరణుల సమర్థన ద్యోతకమౌతుంది.

వేణూ,
పోరాటం ఫెళఫెళల్తో
ధైర్యం అగ్నిపర్వతంతో
నాలోకి నా ప్రజల్లోకి
తిరిగి నువ్వు బ్రతకలేవా? —నగ్నముని.

మెతుకుకోసం మానాన్ని కొల్చుకున్నప్పుడు
జాలిబడ్డగుండెలో నా దేవుడున్నాడు
నా దేవుణ్ణి చూపిస్తానన్న మానవుడు
మానవత్వాన్ని తప్ప మరోమతాన్నంగీకరించడు.

ఇలాంటి కొన్ని కేకలలో మానవతావాద ఆదర్శ ఉద్గారాలు వినిపిస్తాయి. పేదరికంపట్ల జాలి, సానుభూతి వ్యక్తంచేయబడ్తుంది.

అంధకారంలో ప్రేతాత్మల హాహాకారంతప్ప మరేమీలేదు
కాలుతున్న కళేబరాల కమురువాసనతప్ప మరేమీలేదు
చెప్పు; ఇప్పుడైనా నిజంచెప్పు
పోనీ- దయుంచి
ఈ దిక్కుమాలిన శవంమీద ఆకాశాన్నికప్పు. —మహాస్వప్న

* * *

ఈప్రపంచం మారదబ్బాయ్
చాలామంది ప్రయత్నించారు
అని ఒక్కముక్కలో తేల్చేసి,
ఇంగ్లీషువాడు గొప్పవాడోయ్
అనేసి సరైన ఆంధ్రుణ్ణయి
వరల్డ్ బైనైట్ సినిమాకెళ్ళాను కదూ? —భైరవయ్య.

ఇలాంటినిట్టూర్పులూ, అపహాస్యాలురెండూ కుష్ఠువ్యవస్థలో అక్కడక్కడ స్ఫుటంగా గోచరిస్తాయి. మొత్తానికి, స్వైరభావనాశీలతతో వీరికవిత సాంఘిక విప్లవానికి నాందీవాక్యంపల్కేరీతిలో కొనసాగుతుంది.

కాని ఆత్మలను అమ్ముకునేవాడు, ఆదర్శాలను స్వార్థాలకు పణంపెట్టేందుకు అలవడినవారు దూషణలకు, శాపనార్థాలకు రోషంపొందగలరా, సందేహమే. చేవచచ్చినవారిని దూషించడంఅంటే చచ్చినపామును కొట్టటమేమోఅన్నది దిగంబరకవులు ఆలోచించాల్సిన అంశం.

పాఠక లోకానికికూడ పై అంశం సువిదితమే. ప్రతివారూ, ప్రతిరోజూ కపట దేశభక్తులను వంచక వ్యాపారులను మనసారా తిట్టిపోసుకుంటూనే వున్నారు. వారేమో తిట్లు గాలికిపోయేపేలదా అన్నవైఖరిలో కాలం వెళ్ళబుచ్చుతూ పోతున్నారు. మర్యాదగానేకాని, అమర్యాదగానేకాని నిరసించటంవల్ల, దూషించడంవల్లతమ స్వార్థ ప్రయోజనాలకు, ప్రాబల్యానికి నిజంగానే దెబ్బతగులుతుందని గమనించేస్థితి రానంత

వరకూ అవకాశవాదులు లెక్కచేయబోరు. కనుక, వాటిని ఆచరణాత్మకంగా ప్రతి ఘటించే ప్రత్యామ్నాయశక్తుల ఆవశ్యకత సమస్య యెదురౌతుంది.

మాటలకూ చేతలకూ ప్రభావంలో తేడాలేకపోలేదు. పరిస్థితులను మార్చ గల్గేది చేతలేకాని మాటలుకావు. కనుక కుళ్లును అసహ్యించుకునేవారు కుళ్లువ్యవస్థను ప్రతిఘటించే ఉద్యమాచరణతో సమన్వయాన్ని కలిగియుండటం అవసరమౌతుంది. అలా లేనిలీరుకు పరిష్కార చైతన్యం కొరవడే భావ అసమగ్రతలో చిక్కుకోవడం జరుగుతుంది. స్వార్థపర అవకాశవాద ప్రాబల్యంకంటె వాన్ని ప్రతిఘటించే విప్లవ శక్తుల 'విమోచన' ప్రేరణ అధికప్రధానం నేటి ప్రపంచంలో స్వాతంత్ర్యంకోసం, సాంఘికన్యాయంకోసం రైతుకూలీలు, విద్యార్థియువకులు. ఉద్యోగివర్గాలు, పలుసంస్థలు, అఖిలప్రజలు అసంఖ్యాక పోరాటాలను సాగిస్తున్నారు. తుపాకితూటాలకు రొమ్ములొడ్డి ప్రతిఘటనలు జరుపుతున్నారు. అశేష త్యాగాలతో వ్యవహరిస్తున్నారు. దిగంబర కవులు యే స్వార్థఅవకాశవాద హయాము‌ను నిరసిస్తున్నారో దానినేకూలదోసి, నవ్య అభ్యుదయశకాన్ని నెలకొల్పాలని స్వాతంత్ర్యశక్తులు పలు ఉద్యమాలు సాగిస్తున్నవి. కారుమబ్బులు అట్టేకాలం ఉండవు. స్వేచ్ఛాపవనాలకు అవి చెల్లాచెదరై విచ్చుకొని పోతవి. చరిత్ర ఆగబోదు. తుఫానుద్వారా స్వర్గాన్ని పట్టుకొనే విప్లవ ఆకాంక్షలు ఊరకేపోవు.... కుష్ఠువ్యవస్థకు తగు సల్ఫాన్స్‌ను వినియోగించడం సాధ్యమే. అందు వల్ల కవితకు ఉద్యమాలతో సంబంధాలు అనివార్యం. సాహిత్యం ఉదీయమాన నవ్య శక్తుల ప్రగతికామనలనుండి, ఉద్యమాచరణనుండి ఉత్తేజనపొందుతుంది. వాటి స్వభా వాన్ని లక్ష్యాన్ని తనలో ప్రతిబింబిస్తుంది.... వ్యక్తిగతవిసుగుదల, నిస్పృహల వ్యక్తీ కరణవరకేకాక దానిని నివారించగల కర్తవ్యాచరణ సంబద్ధతతోకూడిన ఆశాదీప్తుల అభి వ్యక్తికి ఆలంబనగా ఉంటుంది. అలాంటి కవితద్వారా కళాత్మకంగా సృజనశీలతను, ఆదర్శవిలువలను సంతరించుకొని భావికి ఆచరణాత్మక ప్రేరణను చేకూర్చడంసాధ్యమే. అలా సాహిత్యోద్యమం సాంఘికాచరణతో సమన్వయం చెందటాన్నే అభ్యుదయ సాహితీ సంప్రదాయంఅని పేర్కొంటారేమో....

ఎలాగైనా, ఉద్యమిక సాంఘికోద్యమాకాంక్షలను, వాటి సాధనకై వర్తించే నాయకత్వ పాత్రను, వాటి స్వభావోదాత్తతను ఉన్నతినిగూర్చిన ప్రేరణను ఆకళించు కొన్నప్పుడే సాహిత్యం వాస్తవికోత్తేజంతో మానవతకు సారధ్యపాత్ర నెరవేర్చగలదు. ఆ దిశవైపు కేంద్రీకరించే విషయంలో దిగంబర కవులు ఆలోచించగలరని ఆశిద్దాము. కుళ్లుపైన ముసుగును తొలగించడమేకాదు; ఆ కుళ్లును కడిగివేయగల సాధన సంపత్తి కొరకై, శక్తియుక్తులకొరకై అన్వేషణవైపు దృష్టిని ప్రసరించవలసి ఉంటుందని తోసుంది.

'ఎండిపోయిన జాతి
పీక్కుతినబడిన జాతి,
కాలిపోయిన జాతి
కమిలిపోయిన జాతి
కంపుకొడుతున్న జాతి
పిరికితనంకాక మరేమైనా కంటుందా? —నగ్నముని.

* * *

'అంతర్ జాతీయకాదు, అంతర్ ప్రపంచాల మనిషికి
గతం తల్చి, మనల్ని తలచి, దారుణాన్ని తలచి
గుక్కపట్టిన శిశువుకి,
నగ్న శిశువుకి
జోలె నూపుతూ
మరణంపై మంటచిమ్ముతూ
లాలిపాట పాడుతున్నాను' —నగ్నముని.

* * *

'ఇక్కడే.
ఈ చౌరస్తాలో సిగరెట్ల అంపశయ్యపై
ఆకలిని ఆవిష్కరించాను
సారాసముద్రాలు ఇంకినకళ్ళతో
మరిగిన సూర్యుణ్ణి నంజుకుంటూ
మృత్యువుని కాస్త కాస్త కొరుక్కుతిన్నాను.' - -మహాస్వప్న.

పై దిక్‌లలో గోచరించే తిరోగామ ధోరణులు మానవతా 'ద్వేష' ధోరణుల వరకూ, నైరాశ్యవాదపు అంచులవరకూ పోయినట్లు స్పష్టం. ఇలాంటి ఆలోచనలతో 'కుష్ఠువ్యవస్థను పోషిస్తున్నవాళ్లనీ— యీవ్యవస్థనీ సర్వనాశనం చేయడానికి దిగంబర కవులు పూనుకున్నారు' అని ప్రతిజ్ఞలు చేయడం అసంబద్ధత కాదా. ఇది దుర్గంధ సంస్కృతిని నాశనంచేసేధోరణి యెంతమాత్రంకాదు.

సాంఘిక జీవితాన్ని కవితావస్తువుగా తీసికొన్నప్పుడు సమస్యల ప్రశ్నలను యెదుర్కోవలసియుంటుంది. కనుక సవిమర్శకమైన ప్రస్ఫుటావగాహన ఆవశ్యక మౌతుంది మనం దేన్నివ్యతిరేకిస్తామో, దేన్ని అనుకూలిస్తామో యేమేరకో-అందుకు ఆధారమయ్యే ప్రాతిపదికయేమిటో అనేది నిర్దిష్టతతో వివక్షించుకోవాలి. లేనిచో అప వ్యాఖ్యానానికి దారితీసేప్రమాదం ఉంటుంది....

'బుద్ధా నువ్వూ నీక్షమా నాకక్కర్లేదు
నువ్వొక్కడివే బోధికిస్రిందచావు' -నగ్నముని.

* *

ఆకాశమంతయెత్తున గాలినాలుకల్లో
నీతిగ్రంధం వాడవాడలా తగలబడే క్షణం
సమీపిస్తున్నది. —నగ్నముని.

ఏదేశం ఏసహాయం యెందుకు చేస్తున్నదో
అర్థంకాని
దిక్కులేని దైన్యపుకన్నీళ్ళ వియత్నాం. —నిఖిలే

బుద్ధుడు అన్యాయసమర్థనకొరకై క్షమను బోధించాడా? నీతిగ్రంధాన్ని దాని దురుపయోగంకొరకేవ్రాసినారా? వియత్నామ్ లక్ష్యశుద్ధిరహితంగా పోరాడుతూఉన్నదా? పైభావాలలో సందర్భశుద్ధి యెంతవరకు అన్వయిస్తుంది? ఆలోచనీయం.

ఆదర్శాలను దురుపయోగపరచడం సంభవం. కాని ఆదర్శాలనేవి వస్తుతః అంతకంటె ముఖ్యం. మానవ బలహీనతలు ఉంటవి, కాని మానవత అంతకంటే ముఖ్యం. మనం యెదుర్కోవలసింది దురుపయోగాన్ని, బలహీనతలనూ, వీటికి కారణభూతులయ్యేవారిని. అదికూడ మానవత, ఆదర్శాల పునరుజ్జీవన లక్ష్యంతోనే. అంతేకాని, మూకడమ్మడిగా రాళ్లురువ్వే ప్రవృత్తిని ప్రదర్శించుకొనే పరమలక్ష్యంతో కాదు. కనుక ఔచిత్యదృష్టిని విస్మరించలేం.

అదేవిధంగా విమర్శకుకూడ సభ్యపరిమితులుఉంటవి. చర్మరంధ్రం, లెవెట్రీ, వరిబీజం, తోలువ్యాపారం, రొమ్ములుపిసకడం, విరేచనాలు కార్చడం, లంగా యెత్తడం వంటిపదాలను కావాలని వాడటం జుగుప్సకు మాత్రమే దారితీస్తుంది. ఇలాంటి వస్తువుల ప్రదర్శననుచూడాలని యెవరూ కోరరు. వాటిల్లో ప్రత్యేకదర్శనీయతఉందని కూడ విశ్వసించరు. కనుక వాటి వికృతరూపాలప్రదర్శన అశ్లీలతగానే కనపడ్తుంది. అందుకు,

ఒరే పీనుగా,
ఇదికూడా నీకు అశ్లీలంగానే కనపడ్తున్నదా? —(నగ్నముని.)

అని ప్రశ్నించేధోరణి బాధ్యతతోకూడిన సమాధానంకాజాలదు. సౌందర్యోపాసన క్రమంలో నగ్నరూప ప్రదర్శనకు అనుమతిఉంది. మానవ ఆంగికసౌందర్య విశేష ప్రదర్శన నిషిద్ధమేమీ కాదు. ఐనా, 'విరూప' ప్రదర్శన— అనారోగ్యకర ప్రదర్శన అవాంఛనీయమే. ఈ రెండుప్రవృత్తులమధ్య ఔషధానికీ, విషానికీఉన్నంత

లేదా ఉంటుంది. ఒకటి స్వాస్థ్యానికి. రెండవది స్మశానానికీ దారి చూపుతవని విస్మరించలేము....

దిగంబరకవులు సభ్యతా, విధి- బాధ్యతలను అధిగమించే విశృంఖలరీతులలో కొట్టుకొనిపోవడం వాంఛనీయం కాదు. అలాంటిధోరణులు మానవతావాదం అనికాని లేక నిజాయితీఅనికాని గుర్తింపుపొందజాలవు. ఎందుకంటే అవి మానవతావాదనిజాయితికీ, దాని ఆచరణకూ అన్వయించవు. ఈ అంశాలను ఆత్మవిమర్శకు స్వీకరించి దిగంబరకవులు తమ సాహిత్యోద్యమ కర్తవ్యాల విషయంలో పునరాలోచనచేయవలసిన అగత్యం ఉన్నదని భావిస్తున్నాము.

—పాములపర్తి సదాశివరావు.

## వైతరణి

[ క్రౌన్ 60 పేజీలు, 16 ఖండికల సంపుటి. మూల్యం: ఒక రూపాయి. రచన: సి. వి. కృష్ణారావు. ప్రచురణ: ఫ్రీవర్స్ ఫ్రంట్, హైదరాబాదు. ప్రతులకు: చింతల నర్సింహులు అండ్ సన్స్, హన్మకొండ. ]

ఇందులో "మహా గుహలు" అనే ఖండిక 'వైతరణి' స్వరూపాన్ని చూపే చిచ్చుబుడ్డి.

"ముళ్లను గులకరాళ్లను
నెత్తురు కళ్లై చూచే పాదాలకు
చెప్పులు కుట్టినవారు"

వంటి పాదాలలో 'సత్యపు పచ్చి పుండ్లు' పాఠకుల కన్నెదుట కొట్టవచ్చినట్లు నిలుస్తాయి. 'శాంబ్రిం' వంటి మాండలికాలు ఒకటీ అరా చోటుచేసుకొని రచన, మంచి పాకంలో బలపడుతున్నది.

"దేహానికి కాపుంచను
ఒక్క ఫేల్లిక్క అనల్లుండదు
జుట్టుకు పట్టించుకోను
స్నానెబొట్టు నిలవుండదు."

ఇలాంటి కొన్ని చోట్ల రచన, భావవ్యక్తీకరణ చాలా సాదాగా వుంది. రచయిత బీదతనాన్ని లీలగా కన్నబడుస్తున్నాయి. పై పంక్తుల్లో త్రిస్రగతిచ్ఛందమే ప్రాణంగావుంది.

కటిక చీకటిలో వైతరణి ఒడ్డున దిక్కులేకుండా దీనంగా నిలబడి—

"ఏ వ్యూహాల వైనతేయుడు దాటించునో యీ తమస్సు
ఏ సాహస మహాశక్తి లంఘించునో యీ వైతరణి"

అని ఆశవైపుగా చూస్తున్నాడు కవి.

మురికిపేట జీవితం వైతరణి: దీన్ని దాటడానికి కవి ఆలోచన యెలా వున్నది?

"మురికిపేటనుంచి మృత్యు గహ్వరంలోకి
పంపిస్తే అంతే చాలు."

కవియొక్క సందేశం అస్పష్టతాదోషంవల్ల సమగ్రంగా తోచడం లేదు:

"ఇటు యావత్ప్రపంచం భగ్గునమండి
విడిచిన విలువలు పునర్లిఖించి
మర్యాదలు, ధర్మం, కట్టుబాట్లు
శాసించిన సంఘం కాలే చితికి
సగౌరవంగా కొంగు కొంగు వేసిన ముడితో
మూడు ప్రదక్షిణలు చేసి
నాలుగు తిలోదకాలిద్దాం
మరు నిముషం నవజీవనం సాగిద్దాం."

నవజీవన విముక్తిమార్గం ఇదుగో—

"ఇప్పటి అగచాట్లకు విముక్తి
మన సంఘటనశక్తిలో వుంది."

నిజమే: కానీ, మనల్ని సంఘటితపరిచే యే సిద్ధాంతాన్నీ మనంనమ్ముకొని అనుష్ఠించ లేకున్నాం: దాన్ని కూటినీళ్ళకు అమ్ముకొంటున్నాం.

"బుగ్గల సంచీలో
బటాణీలు ఖాళీ అయిన కోతి
దేరా శిఖరానికి గంతిడదామని చూస్తున్నది."

ఇదీ మనగతి!

తనకోసం బతికే మహరాజుకంటే, తన తోటివారికోసం బతికే బీదవాణ్ణే ప్రపంచం మాన్యపరిచిందనేందుకు చరిత్రే సాక్ష్యం. ఆత్మమోక్షం సాధించినవారితో ప్రపంచానికి ప్రమేయంలేదు, జగత్కల్యాణం కోరినవారి కోసమే, సంఘం నీరాజనం పడుతున్నది. విశ్వ శ్రేయాన్ని విస్మరించి, కేవలానందంకోసమే కవిత్వమైతే, అది ఒక విలాసంగా- భోగంగా- నీచాభిరుచిగా- ఆస్వాద్యమాత్రందేమో?

సౌందర్యం వ్యక్తినిష్ఠం. పతితుడూ, బాధాసర్పదష్టుడూ ఐనవాడికి— వాడి బాధను విశ్లేషించి కవి తన వాక్కులలో చెప్పినప్పుడు, ఆనందం కలుగుతుంది: తిన మరిగినవాడికి మనోవైకల్యం ఏర్పడుతుంది। ఐతే సంఘం మారింతర్వాత- అభిరుచులు మారి- పూర్వ సౌందర్యస్థితికి భంగం కలిగి, అది శాశ్వతత్వం కోల్పోతుందికదా, అనవచ్చు. కావ్యం శాశ్వతం, విశ్వజనీనం కావాలంటే, తాత్కాలిక సాంఘికాంశాలను వస్తువుగా తీసుకోరాదని ఆదిమవాసుల వాసనలు పోనివారి సిద్ధాంతం। వైష్ణవమాయల, రంభాపరిరంభణాల, అరాళకుంతలల సృష్టించిన కవుల కావ్యాలు చిరంగా నిలుస్తున్నా యని నమ్మేవాళ్లని మనం కాదనలేము.

అట్లని ఉపదేశాలు, ఉద్ఘాటనలు మాత్రమే గూడా సౌందర్యం అవుతుందని చెప్పడంలేదు. సి. వి. కృష్ణారావు కావ్యంలో సౌందర్యం మామూలు మట్టసాన్ని దాటలేకపోయింది. కాని మురికిపేట జీవితంగురించి కవి పడుతున్న తపన, ఆయన కవిహృదయంగల మానవతావాది అని చాటుతున్నది.

'కృష్ణారావు ఆధునిక తెనుగు సాహిత్యానికి పాతకాపే' అయినా, రచన అప్పుడూ ఇప్పుడూ హానివృద్ధులు లేక స్థిరంగా వున్నది। కృష్ణారావు గొప్ప భావుకత గలవాడు. చెప్పడానికి కావలసిన నిష్ఠ, తక్కువస్థాయిలో వున్నది. ఈ "వైతరణి"కి ఈవలిఒడ్డున "కుందుర్తి" 'ఒక మంచి ప్రయోగం' చేసినా, దీన్ని దాటడం చాలా మటుకు అస్పష్ట స్థితిలోనే.

'జానెడు తప్పటడుగులతో'— 'పెనవేసి కుంటున్నవి'— 'వేసికున్నా'—వంటి రూపాల విషయంలో రచయిత కొంచెం శ్రద్ధ చూపవలసింది. అచ్చు తప్పలు మామూలే।

## చలి నెగళ్లు

[ డెమ్మీ 76 పేజీలు— 20 స్వచ్ఛంద కవితా ఖండికలు. వెల: రూ. 2-00. రచన: వరవరరావు. ప్రచురణ: స్వేచ్ఛాసాహితి. హనుమకొండ. ప్రతులకు: నెల్లుట్ల సంజీవరావు. స్వేచ్ఛాసాహితి, 6/551/3. బ్రాహ్మణవీధి, హనుమకొండ. వరంగల్ జిల్లా ]

---

బాపు ముఖచిత్రంతో, అట్టచివర రచయితృముఖచ్ఛాయాచిత్రంతో, ముచ్చటగా, అత్యల్పమైన అచ్చుతప్పులతో, "గుడిపాటి వెంకటచలానికి"గా ఈ స్వచ్ఛంద కవితా సంకలనం వెలిసింది.

"సామాజిక ప్రయోజనంగల సాహిత్యమే శాశ్వతంగా నిలువగలదు." అని యీతొలిప్రచురణ వెలయించిన "స్వేచ్ఛాసాహితి" అభిప్రాయం.

స్తబ్దతకు సంకేతంగా చెప్పిన చలిని ఈనెగళ్ల తొలగించగలవని కాలంమీద జాలిమీద విశ్వాసంగలిగి 'సామాజిక ప్రగతివాది'గా ఇట్లా అక్షర రూపంతో సాక్షాత్కరిస్తున్నాడు వరవరరావు.

కవిగా, అంతకంటె ముఖ్యం — మానవుడుగా, వరవరరావు చూస్తున్న ఈ స్వతంత్రభారతదేశం (దాదాపు మొత్తం ప్రపంచమాత్రం?) ఎలావున్నది? ఇదంతా ఒక "రాత్రి". కవి హృదయపు ఆవేదనాభాషలో— ఒక్కమాటగా— చెప్పాలంటే దీన్ని "రాత్రి" అనవచ్చు.

మనకు స్వాతంత్ర్యంవచ్చింది మాటలో; వట్టి 'మాట' లోనే. ఆమాటతో పాటేపుట్టిన అర్థం మాత్రం అందులో లేదు. వ్యతిరేకలక్షణలో వ్యవహారం జరుగుతున్నది! "ఈరాత్రి పూస్తుందనుకున్న గులాబీ- జాబిల్లి ఏదీ?" లేదు. ఇదీ వ్యక్తియొక్క ఆనంచపుగతి. "రాత్రి.... రంకుటాలువలె చూస్తున్నది." ఇదీ సమాజస్థితి. "ఈరాత్రి దొంగ పసరానికి బంజరుదొడ్డిలాగున్నది." ఇలాగే వుంది అంతర్జాతీయ ప్రగతి.

కరుణరస ప్లావితమైన "రాత్రి" మన సామాజిక అవ్యవస్థకు ప్రతీకగా నిలుస్తున్నది. ఏసిద్ధాంతాలూ, మౌఢ్యాలూ లేని మామూలు మనిషి మొదలు, వ్యష్టినీ సమిష్టినీ ఫిజికల్ బేలన్స్‌లోపెట్టి మోకాటిలావు అద్దాలు పెట్టుకొని చూస్తున్న రాజకీయ సిద్ధాంతివరకూ అందరూ అనుభవించిన రాత్రి యిది.

నిజానికి కూడుదినే మనిషికి నిద్రరాని, రాగూడని రాత్రి యిది. గడ్డితిని, గుడ్డ తొలిగిపోయింది తెలియని స్థితిలోబడి మొద్దునిద్రపొయ్యే చుక్క బర్రెగొడ్డుల్ని దుడ్డుకర్రతో బాధి తగంరేత్రికిముందే లేపి "అభ్యుదయం" కోసం జాగరితులై వుండాలని మహాప్రస్థానపథం నిర్దేశించారు అభ్యుదయవాదులు.

ఈనాడు తూరుపురేకలు మైల విడుస్తున్నవంటె, ఇంతకాలం చలికితట్టుకొని, ఉదుకురక్తం పొంగించుకొని, ఆనందంకోసం కళ్లల్లో ఊపిరిపెట్టుకొని, మనిషి ఎదురు చూస్తున్నాడంటే, అది అభ్యుదయకవులు నిలిపిన ఎర్రబావుటా నిగనిగ, అగ్నికిరీటపు ధగధగలఫలం; పరిహారఫలం కాదని ననుగుతారేమో?

ఐతె ఈఅభ్యుదయవాదం కేవలం "పక్షవాత(ద)"మని నిరస(శ)న(వతాలు బయల్దేరాయి. అభ్యుదయి కవిత్వం నల్లిచ్చిపోయిందని ముండితనంగా 'దాడాడు

బిళ్లు' కొట్టేవాళ్లు ఒకపక్క కొడుతూనే వున్నారు. ఖడ్గసృష్టి చూచిగూడా, వ్యక్తివా ధోరణులను వలచినవారు. సగమాటలో పోవడానికే సిద్ధపడుతున్నారు!

మన స్వాతంత్ర్యంలాంటి తేనెవాగులలో పూల పల్లకీలు సిద్ధమై, సాకీ పల్లకీదండాలు మోగ మొదలు పెట్టాయి! క్రిమంగా అభావ అరాచక వ్యక్తివాద ధో రణులు ప్రిబలి మానవత్వపు ఆలోచనా సరళి మొత్తం దిగంబరమైపోయింది!

సమాజంనుంచి వ్యక్తిని విడదీసి పరిశీలించడం సిద్ధాంత సరళిలోనే సాధ్యం; అది ప్రయోగసరళిలో కుదరదు. అభ్యుదయ కవిత్వమే పట్టిపోయిందంటే, సమాజ మంతా వ్యక్తులుగా ముక్కలై ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క భావరాజ్యాన్ని సృష్టించు కొని, పక్కవాణ్ణిచూసి గాభరాపడి, పైకిబడాయిగొట్టే(సాహిత్య)స్థితి వచ్చిందన్నమాటే!

ఇటువంటి సంక్లిష్ట స్థితిలో వస్తునిర్దేశం చేసుకొని, వ్యష్టినీ సమిష్టినీ ఆకళింపు చేసుకొని, కవితా మార్గాన పయనించడం సంస్కార హృదయులకు సమస్య అయిపోయింది. "ఇది రాత్రీ, దినమూ కాని వేకువ."

పైపూత మందులకు నొప్పి పుట్టుజెడా పోతుందా? లేదు. కడుపులోకి మందు తీసుకోడమే మంచిది. పైపూత తాత్కాలికోపశమనార్థమే, వ్యక్తివాదం పై పూతకువాడేది. అట్లంటే దీనికి స్థితే లేదనీ, పనికేరాదనీ కాదు. దేనిపాలు దానికి వున్నది. ఈసామాజిక, వ్యక్తివాదాల సంయోగ, సమన్వయాలకై వుభయవాదులూ తమ భేషజాలుమాని ఒకచోట చేరి సామాజికవాదానికి బ్రాడ్వే, వ్యక్తివాదానికి పేవ్ మెంటు గట్టి పునాదులమీద కట్టవలసి వుంది! ఈ ధోరణిలో గొంతు సవరించాడు వరవరరావు. "కవిధర్మం పెనునిద్దుర వదలించడం, స్తబ్దత తొలగించడం."

"రాత్రియితే గడచిపోయింది. కాని ఇంకా 'తెల్లవారలేదు.' ఈ వేకువ మొగాన ఇంకా మంచుతెరలు జారిపోలేదు. ఇంకా మనుషుల్లోని భయాలు, సందేహాలు ఆకలి, దారిద్ర్యం, అనారోగ్యం తొలగిపోలేదు. అయితే ఆశకూడ మరిగిపోలేదు." ఇదీ యిప్పటి 'చలివేకువ' స్థితి. దీన్ని గడపడానికి, భళ్లున తెల్లవార్చడానికి వేసినవి యీ "చలి నెగళ్లు". సమాజం అంతట్లోనూ వున్న ఈ చలి, మంచు తొలిగిపోందే వ్యక్తిత్వానికి విలువలేదని కవి సంభావిస్తున్నాడు.

వ్యష్టికేంద్రింగా చూచినప్పుడు వెచ్చని చలి. మెత్తటి మంచు, సజావుగ సాగిపోతున్నట్టు తోచే సమాజం కనిపిస్తుంది కవివృషభుడికి సహజంగా! ఏర్కండిషన్డ్ భవంతు లొచ్చింతర్వాత గూడా, ఇంకా చలినెగళ్లేమిటని 'మంద'హాసాలు చెయ్యబో తారు కవిశరాబులు?

ఈ భావద్వంద్వాలను యోగ్యమైనపాళ్లలోకలిపి కుట్టడానికి ఈకవిత్వపుటాకా వేశాడు వరవరరావు. ఐతే సమన్వయమార్గాన్ని అనుసరించేకవికి, అటు అభ్యుదయ కవులలో గానీ- ఇటు సంప్రదాయ కవులలోగానీ- ఉచిత స్థానం లభించడం కష్టం: ఉభయుల మూతివిరుపులకూ అగ్గంకావలసి వస్తుంది.

"చలికోర్చి శ్రమకు బలికావడమయితే నేర్చిన
సామాన్యుడు
చలిలా వణికించే పెద్దల చాకిరి దెబ్బల నెదిర్చి
'కలికాలపు' చలితెరలను చీల్చివేయాలి.
ఈ చలి తెరలు, ఆకలి చారలు
కాలం గిరలకిందబడి నలిగిపోవాలి. (శిశిరోషస్సు.)"

ఇందులో ఉద్ఘాటనే వుందని, కవిత్వం కానరాదని సంప్రదాయజ్ఞుడు నెట్టేయవచ్చు.

"నిశాదేవి తుషారమయ నిషా తొలగిపోయి
ఉషోబాల కషాయ వసనావృతయై తొంగిచూసింది. (శిశిరోషస్సు)"

అంటే యిందులో వీరాభ్యుదయవాదికి బూర్జువా భావసరళి గోచరిస్తుంది:

"శ్రామికుని కివేమీ చలిసందేశాన్నివ్వజాలవని
విరామ మెరుగకుండా వేకువనుంచీ
తోటకు నీళ్లు కడుతున్న కాపుబిడ్డ
కమ్మని జానపద గీతానికి
సంగీత భంగిమలు కూరుస్తున్నవి.
కాలువ నీళ్లు – సీమ కోళ్లు. (శిశిరోషస్సు.)"

ఇలాంటి వస్తుతత్వమే. సమన్వయమార్గమే- ఎక్కువగా గోచరిస్తుంది యీసంపుటిలో.

శ్రీ శ్రీ లాగా మెచ్చుగత్తి తీసుకోవడంగానీ, తిలక్‌లాగా సమ్మోహనాస్త్రం సంధించడం గానీ వరవరరావు చెయ్యలేదు. ఆయా పద్ధతులు ఒక్కొక్క వర్గానికి మాత్రమే సగిస్తాయి. ఇది ఉభయులకూ నగిచ్చడమూ, గిచ్చడమూ అవుతుంది:

"నగరంలోని నగ్న సంక్షోభాన్ని
చెవిలో గుసగుస వోయెడు పైరగాడ్పు
నగరం బయటి పూరిగుడిసెలో
చలి, ఆకలి కలిమహత్తు. (హిమయవనిక.)"

ఎక్కడబట్టినా విహరిస్తున్నది. ఐతే యీ భేదాన్ని తొలగించడం ఎలాగ? వ్యక్తి మాత్రని చైతన్యంద్వారా ఈ సమస్య పరిష్కృత మౌతుందా? విద్యా సంస్కారవంతులు కొద్దిమందే, తమ హృదయౌదార్యంతో నవ సమాజాన్ని సృష్టించడం మహాకష్టం:

తినమరిగినవాళ్లే యెక్కువ కాబట్టి. సామూహిక చైతన్యంద్వారా, సామాన్యజనుల సంఘటనద్వారా సమాజాన్ని పునర్నిర్మించాలి. ఐతే ఈ సన్నజనాన్ని ఈకవితా శంఖా రావాలూ, ఈ చలినెగళ్లూ ఉత్సాహపరిచి ముందు కురికించగలవా? కలవనే నమ్మిక. ఇందుకుతోడు సంస్కారుల ఔదార్యంకూడా కలిసివస్తే మంచిది; కలిసిరాక తప్పదేమో! ఈ అందరికోసమే ఏ (అసలు)కవి ఎట్లచెప్పినాగూడాను. ఇంకొంచెం విస్తృతపరిధిలో ఆలోచించి అన్వయింప జూస్తున్నాడు వరవరరావు. అందుకే "నేను" మొదలు ('జవహర్ లాల్') 'నెహ్రూ' వరకు- ఆటవెలది మొదలు శార్దూల మత్తేభాలవరకు- ఆయన భావసరళి ప్రపంచితమైంది!

ఈ సమన్వయతత్వం ఈయనతోనే ప్రారంభం కాలేదేమోగాని, ఇంతదాకా వచ్చి తటాల్న ఏదోవైపునుంచి వెనక్కిపోయి స్థిరపడ్డవాళ్లే ఎక్కువ. చాలా మంది వలపుల మెలపులమీద "గోమూత్రికా బంధాలు" చెక్కుకొంటున్నారు పత్రికల ('క్యాష్') చెక్కుటద్దాలకు! ఇందలి రచన అంతా స్వచ్ఛంద కవిత. అంటే ఛంద స్సల్పేటు దట్టించి సత్తవచెయ్యలేదన్నమాట. సహజమైన ప్రతిభా భూసారానికేగిట్టిన ఫలసాయం ఇది. కాని, "అమృతవృష్టి", వర్షాపాత గతిభేదాల సూచనలాగా- త్రిస్ర, చతురస్రాలలో- గ్రాంథిక వ్యావహారిక రూపాలతో వర్షిస్తుంది!

ఇందులోని "మనస్సెల్యూలాయిడ్"వంటి సమాసాలు, 'సత్యజిత్రాల' వంటి శబ్దశ్లేషలు 'పండిత' మనశ్శాటిస్ఫాక్షన్ కలిగిస్తాయి!

కనుపాపల చెలియలికట్ట, రౌడీ మొగనితోపాటు, ఆకాశంలో కెదుగాలని, సమాజానితో- వంటి రూపాలవిషయంలో కవి శ్రద్ధవహించి వుండవల్సింది.

వ్యాఖ్యాన నిరపేక్షంగా, అస్పష్టతాదోష రహితంగా, సంఘ శ్రేయోదాయ కంగా, రసపూర్ణంగా వుండే రచన పదికాలాలపాటు ఉపయోగ పడుతుందంటే- 'చలినెగళ్లు' ఈకోవలో నిలిచి వెలుగుతుందనడానికి సందేహం లేదు.

—బండి నాగరాజు.

## "శ్రీ శ్రీ కవితా ప్రస్థానం"

[ రచన: అద్దేపల్లి రామమోహనరావు, ప్రభాకర్ పబ్లికేషన్స్: నందిగామ. 136 పేజీలు: వెల: 3-00 ]

ఒక ఆధునిక మహాకావ్యాన్ని పూర్వపరిభాషలో వ్యక్తంచేసిన విమర్శనా గ్రంథం యిది. శిల్ప వివరణకు ఆలంకారిక పరిభాషనే వాడడం ఉచితమని యీ రచయిత అభిప్రాయం. ఎంత ఆధునిక రచనయైనా అదికల్గించే ఆనందాన్ని సూక్ష్మంగా వివరించవలసినపుడు పూర్వపరిభాషను వాడకతప్పదని వీరి నిశ్చితాభిప్రాయం. అందుకని ఆధునిక కవిత్వాన్ని ఆపరిభాషలో వ్యక్తంచేసినందుకు, ఆశ్చర్యంగాని, కోపంగాని అక్కరలేదని రచయిత గ్రంథాదిలోనే విన్నవించుకున్నారు.

ఈవిమర్శకునికి అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, ధ్వని యిలాంటి వాటిమీద చాలా గౌరవంవుంది. "ఎంతకొత్తవస్తువుతీసుకున్నా, ఎన్ని కొత్తపోకడలు పోయినా, ఆలంకారికులు సిద్ధాంతీకరించిన మహావిషయాలు యెవరికవితలో పరిపక్వ స్థితిలో పోషింపబడతాయో వారే మహాకవులు కాగలరు''అని ఆలంకారిక సిద్ధాంతాలపట్ల వీరు తన గౌరవభావాన్ని వెల్లడించుకున్నారు. అలంకార శాస్త్రాలు గీచిపెట్టిన గీతల నుండీ ఏకవీ తప్పించుకోలేడనే, అధవా తప్పించుకోవాలని ప్రయత్నించినా మహాకవు లలో అవి అనివార్యంగా ప్రవేశిస్తాయనీ, కాబట్టి ఏకవిని కొలవాలన్నా పూర్వఅలంకార శాస్త్రాలకు మించినసాధనాలు లేవనీ, వీరు అవకాశమున్న ప్రతిచోటా గట్టిగా చెప్పు కొన్నారు. ఆదృక్పథంతోనే వీరు శ్రీశ్రీ 'మహాప్రస్థానాన్ని' మధించి "శ్రీశ్రీకవితా ప్రస్థానం" అన్న యీగ్రంధాన్ని వెల్వరించడం జరిగింది.

శ్రీశ్రీ కవిత్వంమీద వచ్చిన మొదటి విమర్శనా గ్రంథంగా మనం దీన్ని స్వీకరించవచ్చు: శ్రీశ్రీ కవితమీద యీరచయితకుండే గౌరవం అపారమైనది. శ్రీశ్రీని మహాకవిగా నిలబెట్టడానికిచేసిన ప్రయత్నంగాదిది. మహాకవి శ్రీశ్రీపట్ల తన బాధ్యతను నెరవేర్చుకోటానికి చేసిన ప్రయత్నమిది. ఒక మహాకవి రచనను సమగ్రంగా విమర్శించాలంటే, అతని కవిత్వంలోని ప్రతి అక్షరాన్ని శోధించవలసి వుంటుందని రచయితే ఒకచోట చెప్పుకున్నారు. "అక్షరగతమైన శిల్పం కొన్నిచోట్ల మహాకవులలో

చాలా సూక్ష్మంగా వుంటుంది" కాబట్టి సూక్ష్మశిల్పదృష్టితో మహాప్రస్థానాన్ని పరిశీలించే ప్రయత్నం యిందులో జరిగింది. "ఈపద్ధతి కొందరాధునికులకు వాదస్తంగా కనబడినా, ఈవిధమైన విమర్శనారీతిచేతనే మహాకవి సరస్వతి తృప్తి చెందుతుందన్న నిశ్చయంతో వీరీ పర్యాలోకనకు పూనుకున్నారు. అద్దేపల్లివారు, తాము నిర్ణయించుకున్న పరిధి మేరకు ఆలోచిస్తే యీ గ్రంథం పరిపుష్టమైనది. ప్రయోజనకారి మైనదిగా మనం భావించవచ్చు.

ఈగ్రంథంలో వరుసగా 1 శ్రీశ్రీ-ఛందస్సు, 2. శ్రీశ్రీ-కవితా! ఓకవితా! 3. శ్రీశ్రీ-కథనశక్తి, 4. శ్రీశ్రీ-ఆవేశం, 5. శ్రీశ్రీ-కవితాదృష్టి, 6 శ్రీశ్రీ-ఆలంకారికత, 7. శ్రీశ్రీ-మానవత, 8. శ్రీశ్రీ-ఎరుక, 9. శ్రీశ్రీ-దేశచరిత్రలు, 10. శ్రీశ్రీ-స్వతంత్ర మార్గనిర్మాత; అన్న వ్యాసాలున్నాయి.

మొదటివ్యాసంలో శ్రీశ్రీ సృష్టించుకున్న ఛందస్సునుగూర్చి పర్యాలోకన జరిగింది. పరాకాష్ఠ పొందిన, లయ శ్రీశ్రీ ఛందస్సులో ఎలా పరిణతి చెందిందో యిందులో చర్చించారు. కాని శ్రీశ్రీ ఛందస్సుగురించి చెప్పేటప్పుడు, గురు లఘు నిర్ణయంచేసి, యిక్కడ గురువయిందిగాబట్టి ఉద్రేకధ్వని యేర్పడిందని, బిందుసహితంగా వుండిగాబట్టి మరోది యేర్పడిందని నిర్వచించడం శ్రీశ్రీ ఛందస్సును ఆవిష్కరించినట్టుగా మాత్రం లేదు. అక్కడ అలాంటివి వారు వారు చదువుకొనే ధోరణినిబట్టే ఉత్పత్తిల్లేవేగాని సమగ్రమైన నిర్వచనాలు మాత్రంగావు. శ్రీశ్రీ రచనలు ఉత్కృష్ట భావగీతాలు మాత్రమే! వాటినిలా 'డిఫైన్' చెయ్యడం సమంజసంగాదు శ్రీశ్రీయే ఒకచోట యిలాఅన్నారు. "హృదయాలను, మానసాలను, కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాదప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించగల అధికారము గలదు. అట్టి అతని సంచారాలలో ఏసన్మూహూర్తానవో కావ్యగీతం ఒకటి మెరుగులు దీరిన విలక్షణ రచనా ధోరణిలో వెలుగు చూస్తుంది. ఆగీతం కవి అనుభవించిన రస స్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించకలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం యిది. ఆ మహోన్నత సంసిద్ధినందుకోవాలని చేస్తున్నప్రయోగాలు నా ప్రస్తుత రచనలు—" ఈధోరణిలో నిర్వచనం యిచ్చిన శ్రీశ్రీ, తన కవితలోని గురు లఘువులను చీల్చిచెండాడి నిర్వచనాలు యివ్వడం, అంగీకరించదనే నాఅభిప్రాయం.

కవులందరికీ 'మానిఫెస్టో' అనదగిన 'కవితా! ఓ కవితా!' అన్న ఖండికపై వ్రాసినవ్యాసం సమగ్రంగా వుంది. ఈఖండికను మూడు విధాలుగా విభజించి, పరిశీలించిన విధానం అద్దేపల్లివారి నిశితదృష్టిని ప్రతిబింబిస్తుంది. శ్రీశ్రీ అలౌకికానుభూతిని

రచయిత యిందులో చక్కగా ఆవిష్కరించారు. కాని ఒక్కోచోట రచయిత ఎందుకో మరీ వెనక్కు పోయారేమో అనిపిస్తుంది. "ఎటుచూచిన చటులాలంకారింపు మటుమాయల నటనలలో" అన్న వాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ, ఇక్కడ మూర్ధన్యాక్షరమైన టకార వృత్తిని కవి ప్రయోగించాడు గనుక, కవితా కన్యను చూడటానికి శ్రీశ్రీపడిన కష్టం యిందువల్ల స్ఫురిస్తోందిఅనటం మరీ ఛాందసంగావుంది. ఇంకా "శిశువు చిత్రనిద్రలో ప్రాచీనస్మృతులూచే చప్పుడు." "ఉన్మాది మనస్సినీవాలీలో ఘూకంకేకా, భేకంబాకా" ఈరెండూ ఈకవితలో లోపంగా వున్నాయనీ, శబ్దఘటన సముచితంగా లేదనీ అద్దేపల్లి వారు పేర్కొనటం ఆశ్చర్యంగావుంది! అభ్యుదయ కవిత్వంపై 'ఫ్రాయిడిజం' పరిభావం కొంతవరకు వుందని అందరికీ ఎరిగినసత్యమే! ఆదృష్టితో వీటిని ఆలోచిస్తేచక్కగా అర్థమౌతుంది. అంత వేగంగా విమర్శకులు లోపమనీ, సముచితంగా లేదనీ కొట్టి వేయడం భారమైనవిషయమే! "సంపూర్ణ భావానుభూతి, అందీ అందనిరీతిగా, వ్యంజక సామగ్రీసహిత శిల్పదృష్టితో చెప్పగలగడమే ఉత్తమ కవితాధ్యేయం" అని తానే నిర్వచించి పైవాక్యాలను త్రోసివేయడం అపచారమే! ఈకవితలోని కొన్నివాక్యాల్ని పరిశీలించడం రచయిత విస్మరించారో, మరి తప్పుకున్నారో! అవి యివి. 'అగ్నిశిరస్సున వికసించినవజ్రం- ఎగిరే లోహశ్యేన - ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం'- మొత్తంమీద యీ వ్యాసం విమర్శకుని ఆలోచనాశక్తిని పాఠకునిచేత గుర్తింపజేస్తుంది.

కరుణరసం ప్రధానంగాగల 'బాటసారి, భిక్షువర్షీయసి, ఆకాశదీపం అన్న ఖండికలను, 'శ్రీశ్రీ కథనశక్తి' అన్న శీర్షికక్రింద వివరించడం జరిగింది. శ్రీశ్రీ కథన శక్తిని ఆవిష్కరించడంలో రచయిత కొత్త విషయాల్ని మనకు అనేకం పరిచయం చేస్తాడు. మూడు ఖండికలలోని మూడుదృశ్యాల్నీ పాఠకునికి హత్తుకపోయేలా వివరణ సాగింది. ఖండికల ముఖ్యోద్దేశం అటు భావగతంగా శిల్పదృష్ట్యాకూడా రచయిత శక్తిమంతంగా చెప్పగలిగాడు. ఇంతకుమునుపు ఒకరిద్దరు ఈవిషయాన్ని తాకినా యింత సూటిగా చెప్పలేకపోయారు.

శ్రీ శ్రీ ఆవేశం ముఖ్యంగా సింబాలిజమ్‌ను ఆశ్రయించి వ్యక్తమౌతుంది. ఈ సింబాలిజమ్ శ్రీశ్రీ కవితలో ఎలా పరాకాష్ఠపొందినదీ నాలుగవవ్యాసంలో రచయిత చర్చించారు. శ్రీశ్రీ ఆవేశాన్ని యింతచక్కగా వెల్లడిచేసిన వ్యాసం యింకోటిలేదు.

శ్రీశ్రీ-మానవత అన్న శీర్షికలో 'గంటలు–గంటలు' అన్న ఖండికను పరామర్శిస్తూ దానిని శ్రీశ్రీ ఆధ్యాత్మికదృష్టికి అంటగట్టడం యెబ్బెట్టుగావుంది. గంటలు అన్నవాటికి జీవాత్మ, చైతన్యం, ఇలాంటి అర్థాలు కల్పించుకోవటం విమర్శకుని వైయక్తికముద్రగానే భాసిస్తుందిగాని విశ్వసనీయంగా లేదు.

ఉన్నవాటిలో పెద్దదీ, విలువగలిగినదీ అయిన వ్యాసం దేశచరిత్రలు. శ్రీశ్రీ ప్రయోగించిన ప్రతిపదమూ యిందులో ఎలా సార్థకతగలదో రచయిత నిరూపించారు. శ్రీశ్రీ సిద్ధాంత చైతన్యాన్ని విప్పిచెప్పటానికి బాగా ఆధారంగల గేయం 'మహాప్రస్థానం' లో యిదొక్కటే. అద్దేపల్లివారు మరికొంత కృషి చేసివుంటే యీ వ్యాసం సర్వతో ముఖంగా సమగ్రతను పొందివుండేది. రచయిత ఎక్కువ భాగం యిందులోని 'శిల్ప చాతురి' ని విమర్శించడంలోనే నిమగ్నుడు కావటంతో శ్రీశ్రీ సిద్ధాంతిక దృక్పథాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించలేకపోయారు.

మొత్తంమీద యిందులోని ప్రతి వ్యాసం మహాప్రస్థానానికి న్యాయం చేకూర్చిందనటం నిర్వివాదాంశం. ముమ్ముందు రాబోయే చక్కని విమర్శనాగ్రంథాలకు యిది మార్గదర్శి కాగలదని నా విశ్వాసం.

"కవితాశక్తి మాత్రదృష్టితో చూస్తే శ్రీశ్రీ మహాప్రస్థానంలో పూర్వాలంకారిక మార్గమే యెక్కువగా కన్పిస్తోంది. ఐతే అందులో నవ్యలక్షణాలు, మహావిశిష్టమైనవి చాలావున్నాయి" అని చెప్పగలిగిన అద్దేపల్లివారు నవ్యలక్షణాలను మాత్రం యిందులో చూపించే ప్రయత్నం సరిగా చెయ్యకపోవటం విచారకరం.

గ్రంథాన్ని ముగిస్తూ ' పదశక్తికి పాతకొత్తల భేదాలు లేవని" రచయిత తీర్పు యిచ్చారు. ఈ వాక్యాన్ని రచయిత మరొక్కసారి ఆలోచించాల్సిన అవసర ముందేమో!

—"ఎస్. ఎన్. సి."

## 'సాహిత్య ప్రయోజనం ఏమిటి?'

చైతన్యసంస్కృతి, జడ్చెర్ల, సృజన ఆగస్టు '68 సంచికలో ప్రకటించిన పై వ్యాసరచన పోటీకివచ్చిన కళాశాల విద్యార్థుల ఇరవైఒక్క వ్యాసాల్లో ఒక్కటి కూడ సంతృప్తికరంగా లేదు. కాబట్టి ఈ ఇరవై ఒక్కరికీ ఇంకా కొత్తవారికీ కూడ మళ్ళీ అవకాశం యివ్వడానికి పోటీ గడువు 68 డిసంబర్ 31 దాకా పొడి గించనైనది. తక్కిన నియమాలు యిదివరలో ప్రకటించినవే. కళాశాల విద్యార్థులందరూ ఈ విషయము గమనించగలరు.

—జలజం సత్యనారాయణ,

కార్యదర్శి, చైతన్య సంస్కృతి

బాలానగర్ పోస్ట్, మహబూబ్‌నగర్ జిల్లా.

మళయాళం కథ:

# మొగిలిపూల వాసన మిగిలింది

ఎం. టి. వాసుదేవన్ నాయర్

అక్కయ్య ఏడుస్తూవుంది!
దీనికంతకు కారణం నాయనమ్మే. లేకుంటే తన అక్కయ్య ఎందుకు ఏడుస్తుంది!
రాత్రి అనక పగలనక ఒకేతీరున ఏడుస్తుంది. నాయనమ్మ అక్కయ్యను తిట్టి
వుంటుంది—....

అక్కయ్య ఏడుపును ఆపూ సహించలేడు. ఆపూని కూడా నాయనమ్మ ఎన్నో సార్లు తిడుతుంది. తాను చిన్నవాడైనా అక్కయ్యలా ఏడ్వలేక పోతున్నాడు. తానూ అక్కయ్య అంత పెద్దగావుంటే నాయనమ్మ సంగతి చెప్పేవాడే. అక్కయ్య ఏమీ అనకుండా అదేపనిగా ఎందుకేడుస్తుంది....

ఏడుస్తూన్నా అక్కయ్య దరిదాపుల్లో వుండటానికి ఆపూ యిష్టపడడు. అక్కయ్య ఏడుస్తూ ఏడుస్తూనే తనను కావలించుకుంటుంది. ముద్దు పెట్టుకుంటుంది. అక్కయ్య కళ్ల వెంట జారిన వెచ్చటి కన్నీటి చుక్కలు ఆపూ చెక్కిళ్లమీంచి రాలి పోతాయి.

అవును అక్కయ్య ఏడుస్తూవుంది!

తెల్లవారుతుంది. నాయనమ్మ మొదలు లేస్తుందో లేక దాని వదురుబోతు నోరే మొదాలు లేస్తుందో అదే పనిగా వాగుతుంది. వాగి వాగి ఎప్పుడు వూరుకుంటుందో తనకు మాత్రం తెలియదు— ఇంట్లో ప్రతిపని వెనుక నాయనమ్మ గొంతె- తాను యింకాలేవనైనాలేదు. అదిగో నాయనమ్మ నోరు! "ఒరేయ్! ముదనష్టపోడా! లేవరా! ఇంకా లేచి చావవేంరా— అందుకేరా ఈ వెధవ యిల్లు యిలా మట్టికుడుచుక పోతోంది—"

ఈ సుప్రభాతంతో ఆపూ లేచి పెరట్లో బండరాయి మీద కూర్చొని పళ్ళు తోముతూ వుంటాడు. మొహం కడుగుతూ వున్నప్పుడు గ్రహచారం కాలి ఏ

మాత్రం నీళ్లో ముక్కలు నేలమీదపడ్డా, నాయనమ్మ పరుగెత్తుకొస్తుంది- "ఓరే అష్ట గాడిదా! రెక్కలు అరిగి పోయేట్టుగా చాకిరిచేసి శుభ్రంగా అలికిన నేల మీద నీళ్ల పోశావేంరా వెధవా!-"

నాయనమ్మ ఎన్ని తిట్టినా అవి తనకు తిట్లుగానే తోచదు....

వీధి వాకిలిలో చెత్తా చెదారం పోసినా, నూతిలోకి రాళ్ల విసిరినా, కుంటి కుండను పట్టుకొని తాను తబలా వాయించినా, నాయనమ్మ చూడకుండా వుండదు, తిట్టకుండా వుండదు.

తనను యిన్ని తిట్టినా ఏడ్వడేం!

అక్కయ్య ఎందుకు ఏడుస్తుంది?

నాయనమ్మ ఆపూని తిడుతూంటే సహించలేక అక్కయ్య ఓ ఓ సారి అడ్డు పడుతుంది. దాంతో నాయనమ్మ తోక త్రొక్కిన త్రాచు అవుతుంది. నోటికి ఏది వస్తే అదే అంటుంది. ఏడుస్తూనే అక్కయ్య అంటుంది-

''ఇవి పిల్లాడిని తిట్టాల్సిన మాటలేనా'' అని. దాంతో రెచ్చిపోయిన నాయనమ్మ ఇల్లంతా చిందులు త్రొక్కుతుంది. కాందిరించి ఉమ్మేస్తుంది, చేతులు నూ రెడు చాపి ఏవేవో తిడుతుంది.

అక్కయ్య నిశ్శబ్దంగా ఏడుస్తుంది-

అక్కయ్యలా తాను ఏడవడేం!

పైగా నాయనమ్మ అంటుంది-

"ఒసే అంతగా నీ ముద్దుల బిడ్డమీద ప్రేమవుంటే గుండెల్లో పెట్టుకొని కులక రాదటే-''

"అదే నీ కొడుకైతే....''

అక్కయ్య మాట పూర్తికాకుండానే, ఇనుప దరువాజలు మోగినట్టుగా ఖంగుమంటూ నాయనమ్మ గొంతు విచ్చుకుంటుంది-

ఇదే అదనుగా ఎంచి ఆపూ అక్కణ్నించి జారుకుంటాడు; తోటలోకి. తోటలో ఆపూ చక్కన్‌తో కలిసి ఆడుకుంటాడు. గుమ్మడి పొదల మీద వాలిన తూనీగల్ని పట్టుకోవటానికి యిద్దరూ పరుగెత్తుతారు. తోటలోనుంచి యింట్లోకి వెళ్ల తుంటే ఆపూకి అక్కయ్య గుర్తుకొస్తుంది- అక్కయ్య గదిలో చేరి ఒకస్తే కిటికిలో కూర్చొని ఏడుస్తూంటుందని-

సంధ్యాసమయంలో ఆపూ వీధి అరుగుమీద కూర్చొని నామ సంకీర్తన చేస్తాడు. నక్షత్రాల పేర్లు, నెలలపేర్లు వరుసగా వల్లిస్తాడు. అక్కయ్య ఇంగ్లీషు చెప్పుతుంది.

వరండాలో గోడమీద వ్రేలాడిన క్యాలెండరులోని ఇంగ్లీషు అక్షరాలను చూపుతూ, అక్కయ్య చదువుతుంది- ఆపూ అక్కయ్య ప్రక్కలో వొరిగి పోతాడు. అక్కయ్య సుతి మెత్తని వేళ్లు ఆపూ వెంట్రుకల్లో దూరి అడుకుంటాయి- అదే సమయానికి పక్కింటిలోంచి పాటలు వినొస్తాయి- ఈ మధ్యనే పక్కింటి వాళ్లు ఏదో పెట్టెను తెచ్చారు. అ పెట్టెలోంచే పాటలొస్తున్నాయి- ఆ పెట్టె పాడేవన్నీ సినిమా పాటలేనట తాను సినిమా ఎన్నడూ చూడలేదు.- పాట వినడమే తరువాయిగా అక్కయ్య అదోలా అవుతుంది. ఎంత పలకరించినా మాట్లాడదు. ఆ సమయంలో అక్కయ్య ఎందుకు మౌనంగా వుంటుందో ఆపూకి అర్థంకాదు- అక్కయ్యను మరీ విసిగించకుండానే ఆపూ కళ్లు మూసుకుంటాడు. అయినా ఆపూకి అదే ధ్యాస. అక్కయ్య ఎందుకు మాట్లాడదు!

అక్కయ్య చిత్రమైనదే!....

ఆపూకి అన్ని పనులు అక్కయ్యే సర్ది పెడుతుంది. రోజు స్నానం చేయిస్తుంది. 'పీచింగా' తో ఒళ్లంతా రుద్దటం ఆపూకి యిష్టముండదు- స్నానం చేసినాక తన వొళ్లంతా అక్కయ్యే తుడుస్తుంది, చెవుల్లో తువ్వాలకొనలు సన్నగా మెలిత్రిప్పి నీళ్లను తుడుస్తుంది. తన కొంగుతో గుండెలు తుడుస్తుంది. ఉతికిన కమీజు తొడుగుతుంది. దొరబాబులా తనను తయారుచేస్తుంది. బడికి పోయేప్పుడు కడపలో నిల్చుని తాను కనుమరుగయ్యే వరకూ వుంటుంది.

రాత్రి అన్నం దగ్గర కూర్చున్నప్పుడుకూడా అక్కయ్యే తన ప్రక్క వుంటుంది. నాయనమ్మ లేకుండాచూసి ఆపూకి తినిపిస్తుంది. తనకు అక్కయ్య అన్నం తినిపించ డం నాయనమ్మకు ససేమిరా గిట్టదు. తనను మరీ పసివాన్ని చేస్తోందని నాయనమ్మ ఏడ్పు. నాయనమ్మ అనే ప్రతిమాటను అక్కయ్య సహిస్తుందనికాదు. ఓ ఓ సారి అక్కయ్యకూడా ఎదురుతిరుగుతుంది. అక్కయ్య ఎన్నడు యెదరితిరిగినట్లు తోచినా నాయనమ్మ సహించదు. శివమెత్తుతుంది. అర్చిపెడుతుంది. నాయనమ్మలా అక్కయ్యకు నోరులేదు. వున్ననోరుతో అక్కయ్య చేయగలిగింది వొక్కటే. వెక్కివెక్కి ఏడ్వటం!

కోపం చల్లారిపోయాక నాయనమ్మ ముక్కు చీదుతుంది. కోపం వచ్చినా తల బాదుకుంటుంది. ఏడుస్తూకూడ తల బాదుకుంటుంది.

అక్కయ్య ఏడిస్తే ఆపూ సహించలేడు,

అక్కయ్యను మించి నాయనమ్మ ఏడుస్తుంది. అయినా ఆపూకి జాలిరాదు.

కాని ఓతడవ నాయనమ్మ జాలిగా ఏడ్చింది. తనకు అక్కయ్యమీదకల్గినంతజాలి ఆ ఒక్కరోజే ఆపూకి కల్గింది.

ఆరోజు—

ఎవరో ఆగంతికుడు ఎక్కడనుండి ఊడిపడ్డాడో చక్కా తన యింటి గుమ్మంలోకి వచ్చాడు. నాయనమ్మ ఆ వ్యక్తిని చూడగానే గబగబా పరిగెత్తింది. పొడుగుచేతుల కమీజు, పీచుజుట్టు, చంకలో సంచీ వాడూనూ. నాయనమ్మను 'అమ్మా'అని పిల్చాడు. పదిమందిని తన గొంతుతో అదరగొట్టే నాయనమ్మగొంతు అవ్యక్తిని చూసేసరికి పెకలటంలేదు. ఏమిటేమిటో మాట్లాడుతోంది.

"నిన్ను కన్నతల్లినిరా నాయనా! దూరంనించి వచ్చావు నామాట విని యింట్లోకి పదరా!" అంటూ బ్రతిమాలుతోంది.

"మళ్ళీ నీ ఇంటి కడపలోకి కాలుపెట్టటమా! ఆరేళ్లు అయింది. నా బొందిలో ప్రాణం వుండగా మాట తేడారావడానికి వీల్లేదు. తెలుసా."

నాయనమ్మ ఏడుస్తోంది. సంచిమనిషిని నాల్గుతిట్లుతిట్టి బైటకు గెంటదేం. తెల్లవారింది మొదలు అక్కయ్యను, తనను అదేపనిగా ఆడిపోసుకొనే నాయనమ్మ ఎందుకు యిలా బెల్లంకొట్టిన రాయిలా అయిపోయిందో ఆపూకి అర్థంకాలేదు.

ఏడుస్తూనే బొంగురు గొంతుతో నాయనమ్మ బ్రతిమాలుతోంది— "నా కడుపున పుట్టినవానివి గదటరా! పోనీ. దాన్నేమి అనమంటావో నువ్వేచెప్పు—"

సంచిమనిషి ఏంచెప్పుతోంది ఆపూకి సరిగా అర్థంకావటంలేదు. గొంతుతగ్గించి నాయనమ్మ ఏదో గుసగుసలాడుతోంది. సంచిమనిషి రెచ్చిపోతున్నాడు. నాయనమ్మ నిలువెల్లా అరిటాకులా వొణికిపోతుంది. లోపలికైనా రాకుండా తన కాళ్ల దగ్గరకే నాయనమ్మను పిలుపించుకొని ఎందుకు ఏడిపిస్తున్నాడో అవ్యక్తి- ఆపూకి అంతా అయోమయంగా వుంది. సంచి మనిషి ఆపూవైపు తేరిపారచూశాడు. ఆచూపులకు ఆపూ భయపడ్డాడు. పసిపిల్లల్ని ఎత్తుకుపోయే బూచి కావచ్చు అనుకొని అడుగులో అడుగు వేసుకుంటూనే తప్పుకుపోయాడు. తన నాయనమ్మనే యేడిపించాడంటే అవ్యక్తి తన పీకనే నొక్కేస్తాడేమో. అక్కయ్య వాడికి అగుపించక పోవడమే మంచిదైంది. నాయనమ్మకే హడలిపోయే అక్కయ్య ఆ సంచి మనిషినేచూస్తే.... .... ఛ—పిచ్చి అక్కయ్య, ఊరికేనే ఏడుస్తుంది. ఆరోజు నాయనమ్మమీద జాలి కల్గింది ఆపూకి.

ఆరాత్రి ఆపూకి ఎంతక్కూ నిద్రపట్టలేదు. ఎన్నో అనుమానాలు. పక్కింటి పెట్టిలోంచి పాటలు వినొస్తున్నాయి. సినిమా పాటలేగా!— ఆపెట్టె యెందుకుపాడుతోంది. చక్కన్ను అడిగితే చెప్పలేక పోయాడెందుకు?

అక్కయ్య పరీక్షమీద అటూయిటూ దొర్లుతోంది. ఆ మధ్యాహ్నం వచ్చిన సంచి మనిషి పిల్లలపీకలు పిసికేవాడేనా! ఎప్పుడూ ఏడవని తన నాయనమ్మ అక్కయ్యలా

ఎలా ఏడ్చింది. సంచి మనిషి నాయనమ్మను తిట్టాడేమో? ఎందుకు తిట్టాలి.
"అక్కయ్యా! ఆ సంచి మనిషి ఎవరు?"

"చెప్పవేం అక్కయ్యా!—"
"అతను.... అతను.—"
"పీకలు పిసికేవాడా? అవును, నీవు కనబడక పోవడమే మంచిదైంది అక్కయ్యా."
"అతను మీ మామయ్య బాబూ!"
"ఏం మామయ్య! బొత్తిగా బుద్ధిలేదు. గేటుదగ్గరే నిల్చొని అదేపనిగా నాయనమ్మను ఏడిపించాడు. ఆ కళ్లు నీవు చూళ్లేదు అక్కయ్యా! ఎంత భయంగా వున్నాయని, నిజంగా మామయ్యేనా?"
"అవును బాబూ!"
"మామయ్య అయితే యింట్లోకి ఎందుకురాడు."
"రాడు బాబు."
"ఎందుకు రాడు?"
అక్కయ్య మరేం మాట్లాడలేదు. ఆపూ అక్కయ్య కళ్లలో పరిశీలంగా చూచాడు. నిజంగా అతని అక్కయ్య పిచ్చిదే- మళ్లీ కళ్లను చీరకొంగుతో ఒత్తుకొంటోంది- అదో మళ్లీ అక్కయ్య ఏడుస్తోంది- ఎందుకు?.... ఎందుకు? నాయనమ్మ తిట్టకుండానే అక్కయ్య ఎలా ఏడ్వగలుగుతోంది- తాను ఎప్పుడూ ఏడ్వలేదేం? ... ఆపూకి ఎన్నో అనుమానాలు. ఈ మధ్య అక్కయ్య కూడా తన తన అనుమానాలను చెప్పటంలేదు. పత్రిక్కమీద అక్కయ్య ఎర్రరంగు చీర పర్చింది. మరో చీర అక్కయ్యకు వుంది- కాని దాన్నెప్పుడూ ఈవలకు తీయదు. పెట్టెలోనే దాస్తుంది- ఆ చీర అక్కయ్య ఎన్నడూ కట్ట లేదు. పెట్టె తెరిచినప్పుడల్లా గుమ గుమ లాడుతున్న మొగిలిపూల వాసన వస్తుంది- అంత మంచి చీరను అక్కయ్య పెట్టెలో ఎందుకు పెడుతుంది? పక్కింటి జాను వాళ్ల అమ్మ ఏం చక్కని చీరలు కడుతుందని. ప్రతి రోజూ కోవెల ముందున్న కోనేటిలో స్నానం చేస్తుంది, గుడిచుట్టూ ప్రదక్షిణాలుచేస్తుంది, రంగురంగుల చీరలు కడుతుంది. ప్రతి రోజూ బజారు కెళ్లుతుంది. తన అక్కయ్య కడపకూడా దాటదు. పెట్టిలోదాచిన మొగిలి వాసన చీర ఎన్నడూ కట్టదు....
తన అక్కయ్య పిచ్చిది!

* * *

క్లాసులో ఆపూకి స్నేహితులు అట్టేలేరు. ఒక్క కుట్టి శంకరన్ తప్ప. ఆపూ, కుట్టి శంకరన్ కల్సి ప్రతి రోజూ బడికి వెళ్లుతుంటారు. మ్యాష్టారు కుట్టి శంకరన్ని

ఎప్పుడూ కుట్టి చాత్తన్(సైతాన్)అంటాడు. క్లాస్ అంతా ఘొల్లుమంటుంది. ఆమాట అనటంతో శంకరన్ ఏడుస్తాడు. మాస్టారు మంచివాడు కారు.

ఓరోజు శంకరన్ యింటిదగ్గరనుంచి ఓ నిమ్మకాయ తెచ్చి యిచ్చాడు. తన చిన్నక్కయ్యకు పెళ్లని, యింట్లో బోలెడు నిమ్మకాయలని తెచ్చారని చెప్పాడు.

మా అక్కయ్య పెళ్లి అయితే, నీకూ ఓ నిమ్మకాయ యిస్తాలేరా శంకరన్–" అన్నాడు అపూ.

"అక్కయ్య ఎక్కడిదిరా నీకు" అన్నాడు శంకరన్. అపూకి ఎక్కడలేని కోపంవచ్చింది. కుట్టి చాత్తాన్ అని వెక్కిరించి గూబమీద నాల్గు చరువాలనిపించింది, తనకంత మంచి అక్కయ్య వుందా, అక్కయ్య ఎక్కడిదిరా నీకూ అంటాడు దొంగ వెధవ–

"మాఅక్కయ్యే. మరెవరనుకున్నావ్."

"ఒరే మొద్దూ– మీఅమ్మనే నీవు అక్కయ్య అంటున్నావురా!"

కుట్టి శంకరన్ తెలివితక్కువకు విరగబడి నవ్వాడు అపూ. మాస్టారు ఊరకే అన్నాడామరి కుట్టి చాత్తాన్ అని–

"నీకేం తెలియదు. నీవే మొద్దువు."

"నాకు తెల్సులేరా, మా అమ్మ చెప్పింది."

తన అక్కయ్యనే, అమ్మ అని అన్నందుకు అపూకి కోపం వచ్చింది. దాంతో యిద్దరూ దెబ్బలాడుకున్నారు. కుట్టి శంకరన్ కోపంతో తన నిమ్మకాయ తనకిమ్మన్నాడు. బోడి నిమ్మకాయ, అంటూ అపూ విసిరి నేలకు కొట్టాడు.

అక్కయ్య అమ్మ ఎలా అవుతుందో యెంత గింజుకున్నా అపూకి బోధపడలేదు. తనకి కుట్టి శంకరన్‌లా తల్లిగాని, తండ్రిగానిలేరు. ఉంది ఒక్క అక్కయ్యే. ఆఅక్కయ్య, అమ్మ ఎందుకు కావాలి? ఏం చక్కని అక్కయ్య అని. కుట్టి చాత్తాన్‌గాడు, అడ్డగాడిద, తన అక్కయ్యనే అమ్మ అంటాడు, దొంగ వెధవ!

*　　*　　*

రోజుకన్న ఈవేళ అక్కయ్య ఎందుకో విచారంగా వుంది. అక్కయ్యకేమైనా మతి పోలేదుగదా! ఓ మధ్యాహ్నంవేళ పక్కగదిలో నాయనమ్మ, అక్కయ్యలు మాట్లాడుకోవడం వినవస్తోంది–

"అపూగురించి నీవేం విచారించాల్సిన పనిలేదు." నాయనమ్మ అంటోంది.

"జరగవల్సినదేదో జరిగిపోయింది. ఇప్పుడు బుర్రి పాడుచేసుకొని ఏంలాభం. ఈ సారి అయినా గండంగడిచి బైటపడిందంటే మనం బ్రతికి బైటపడతాం. నామాటవిను. శంకరన్ నాయర్ చాలా మంచివాడు, అతనే అన్నీ సర్దుకపోతాడు."

''అమ్మా! ఏమిటే నువ్వు అంటున్నది '' అంటోంది అక్కయ్య.

నాయనమ్మ గొంతు పెట్టించింది–

"చూడే అమ్మడూ! నీ మంచికోరే చెబుతున్నాను. ఈ మూర్ఖపుపట్టు విడవకపోతేః బ్రతుకంతా నెత్తీ నోరూ మొత్తుకొని ఏడుస్తావ్."

''ఇంతకన్నా పచ్చి మోసం మరొకటి వుండదు.''

"ఏమిటా పచ్చి మోసం?''

''అదంతా ఆలోచించడం మనపని కాదు."

''మనదికాక మరెవరిది? దానివల్ల వచ్చే చెడుగు యేదైనావుంటే, అనుభవించాల్సింది నేనే–"

"అదంతా శంకరన్ నాయర్ చక్కబెడుతాడు,"

''మరి ఆపూ మాట....''

"ఆపూ! ఆపూ! వాడి ఊసుమరి తేబోకు. నామాట విను. ఈ అవకాశం చేయిజారి పోకుండా వుండాలి అని దేవుడికి ఎన్ని మ్రొక్కుతున్నానో నీకు తెలియదు. నువ్వేమో...."

అక్కయ్య వెక్కి వెక్కి ఏడవటం వినవస్తోంది–

* * *

నాయనమ్మ అనుకొన్నట్లుగానే శంకరన్ నాయర్ వచ్చాడు. నాయనమ్మా, అతనూ ఎన్నో గుసగుసలు మాట్లాడుకున్నారు,

"పెళ్లి అయ్యేంతవరకూ, పిల్లాడి వ్యవహారం రహస్యంగా వుంచాలి." అంటున్నాడు శంకరన్ నాయర్. ఆపూకి యిదేం అర్థం కావడంలేదు. అప్పుడంలా కత్తిరించిన శంకరన్ నాయర్ వెంట్రుకల్ని ఉత్సుకతతో చూస్తూ ఉండిపోయాడు.

వంటింట్లో గిన్నె నేలమీదపడిన శబ్దం–

తృళ్లిపడ్డాడు ఆపూ–

''మాలూ!'' నాయనమ్మ పిలుస్తోంది.

కంచుగిన్నె నేల పడినందుకు అక్కయ్యను తిడుతుందేమో–

అక్కయ్య వెళ్లి గుమ్మంలో నిలబడింది.

ఆపూ చెవులురిక్కించి వింటున్నాడు.

శంకరన్ నాయర్ అంటున్నాడు— ''గాబరాపడాల్సిన పనేంలేదు అమ్మాయ్! అన్నిటికి నేను వున్నానుగా. అతనిది నవనీతంలాంటి మనసు. ఒంటరిగాడు. ఇక్కడి విషయా లేవీ అతని చెవిదగ్గరికి వెళ్ళవులే—''

నాయనమ్మ ఏదో గుసగుసలాడింది.

''నీకాభయం అనవసరం, మూడో కంటివాడిక్కూడా తెలియదు. దేవమ్మా! నీవు నిశ్చింతగా వుండు.'' అంటున్నాడు.

ఎందుకో భయం— నాయనమ్మకా!

నాయనమ్మ వంగి వంగి అతనికి దండం పెడుతోంది. ఏంటో అంతా చిత్రంగావుంది. వంటింట్లోకి వెళ్లేసరికి అక్కయ్య వెక్కి వెక్కి ఏడుస్తోంది. అక్కయ్య యేడుపును చూసి అపూ బైటకు పరుగెత్తాడు.

*        *        *

రాత్రివేళ మెలుకువ వచ్చింది. ప్రక్కలోచూస్తే అక్కయ్య లేదు. దీపం యింకా వెలుగుతూనేవుంది. అక్కయ్య తెరిచిన ట్రంకుపెట్టెముందు కూర్చుని సర్దు కుంటోంది. గదంతా గమగమలాడుతున్న మొగిలిపూల వాసన!

అర్ధరాత్రివేళ దీపంపెట్టుకొని పెట్టె యెందుకు సర్దుకుంటోందో అపూకి బోధపడ లేదు. వెనుకపాటుగా వెళ్లి అక్కయ్యను కావలించుకుంటే?....

కాని అపూకి కళ్లు మూతలు పడుతున్నాయి. అలాగే అక్కయ్య ప్రక్కమీద పరిచిన ఎర్రని చీరలో మొఖం దాచేసుకుని క్షణంలోనే కళ్లు మూసాడు అపూ—

ఉదయం పొద్దుపోయేదాకా, అపూ ప్రక్కమీంచి లేవనేలేదు. అక్కయ్యేవచ్చి లేపింది. నూతిదగ్గరికి తీసుకెళ్లి స్నానంచేయించింది. 'కంజి' త్రాగించింది. బట్టలు తొడిగింది. తల నున్నగా దువ్వింది.

''బాబూ! జాగ్రత్తగా వెళ్లబడికి. తోవలో ఆవులూ. గేదలు వుంటాయి. తప్పించు కొని మరీ వెళ్లు. పిల్లలతో పోట్లాడకేం—''

"ఓ. ఆలాగే''

''నాయనమ్మ నిన్ను బాగానే చూస్తుంది.''

"ఆలాగే.''

''నాయనమ్మ చెప్పినట్లువిను. అల్లరిచేయకేం."

''నాయనమ్మ మంచిదికాదు. అక్కయ్యా! నువ్వేకావాలి.''

'బాబూ!'

ఆపూని గుండెలకు హత్తుకొంది. అక్కయ్య ఎక్కడ ఏడుస్తుందో అని ఆపూ భయపడ్డాడు.

"బాబూ! ఒక్కసారి నోరారా అమ్మా అని పిలువరా!"

"ఎందుకు అక్కయ్యా!"

"ఏమీ లేదు, ఊరికేనే బాబూ,"

అక్కయ్య గొంతు వణుకుతోంది.

"అమ్మేది? ఎవరిని పిలువాలి 'అమ్మ' అని?"

అక్కయ్య మారు మాట్లాడకుండా ఆపూని గుండెల్లోకి లాక్కొని, రెండు చేతులా అదుముకుంది.

"బాబూ! మరి బడికి వెళ్ళు."

సంచీని భుజాన తగిలించుకొని ఆపూ కడప దాటాడు. కనుమరుగయ్యేంతవరకూ అక్కయ్య కడపలోనే వుంది.

సాయంత్రం యింటికి వెళ్ళీ వెళ్ళగానే 'అక్కయ్యా!' అని కేకవేశాడు ఆపూ. వంటింట్లో నుండి అక్కయ్యకు బదులుగా నాయనమ్మ పలికింది.

"ఆపూ! ఏంరా నాయనా! రా అమ్మా!" అంది గోముగా—

"ఏమిటి నాయనమ్మా! తిట్టటంలేదేం—" అని అందామనిపించింది ఆపూకి.

"అక్కయ్య ఏది?"

"కంజి వడ్డిస్తున్నాను. త్వరగా రా తాగుదువుగాని."

"అక్కయ్య ఎక్కడికి వెళ్లింది?"

ఆపూకి అదే ధ్యాస.

గదిలోకి వెళ్ళాడు. అక్కయ్య గదిలోలేదు. గదిలో మొగలిపూల వాసన వేస్తోంది.

"నాయనమ్మా! అక్కయ్య ఏది?"

"ఇక్కడ లేదు."

"ఎక్కడికి వెళ్ళింది—"

"వస్తుందిలేరా! వచ్చేప్పుడు నీకోమాంచి బంతిని తెస్తుంది!"

బంతి ఎవనిక్కావాలి. తనకు చెప్పకుండా అక్కయ్య ఎలా వెళ్ళగల్గింది.

ఆపూ అక్కయ్యమీద అలిగాడు. గదంతా కలియచూశాడు. గదిలో అక్కయ్యపెట్టె కూడా లేదు. ఆపూకి ఎక్కడలేని దుఃఖం ముంచుక వచ్చింది. నాయనమ్మ మళ్ళ పిలుస్తోంది, కంజి తాగుదువుగాని రమ్మని.

తాను ఏదీ తాగడు. తాగనేత్రాగొద్దు—

"ఆపూ: ఆపూ......... రా బాబూ—"

ఆపూకి ఏమీ అక్కర్లేదు. పొర్లి పొర్లి దుఃఖం ముంచుకొస్తోంది. తాను యెన్నడూ ఏడ్వలేదు. అక్కయ్య పక్కమీదపరిచిన ఎర్రచీరలో ముఖం దాచుకొని అక్కయ్య మీది కోపాన్నంతా ఏడ్పుగా ఏడ్చేశాడు. అక్కయ్య తిరిగి వచ్చేప్పుడు ఏం చక్కని బంతి తెచ్చినా తాను తీసుకోవద్దు—

"రా నాన్నా కంజితాగ."

"అక్కయ్యా! నాకు చెప్పకుండానే ఎందుకు వెళ్ళావ్! నాయనమ్మ కోప్పడిందా— ఎందుకు వెళ్ళావ్!—???

అక్కడకూడా ఏడుస్తావా అక్కయ్యా—?

ఎర్రచీరలోకిదూరి వెక్కి వెక్కి ఏడ్చాడు మొదటిసారిగా ఆపూ, అచ్చం అక్కయ్యలా. గదిలో మొగలి పూలవాసనమాత్రం అక్కయ్యతో వెళ్ళలేదు—

(అను: వాత్స్యాయనుడు)

# సృజనాకాంక్షలు

పాఠకులకూ, పోషకులకూ, రచయితలకూ నూతన సంవత్సర శుభాకాంక్షలు.

ఈ సందర్భంలో సృజన కొన్ని సాహస నిర్ణయాలు ప్రకటిస్తున్నది.

ఈ విషయంలో అభిమానుల అభిప్రాయాలు,

నిర్మాణాత్మకమయిన సూచనలు ఆహ్వానిస్తున్నాము.

ఒకటి, 1969 నవంబర్ నుండి సృజనను ద్వైమాస పత్రికగా మార్చాలని సంకల్పం. (మారిస్తే) రెండు, 1970 జనవరిలో సృజన శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సంచికగా వెలువడుతుంది.

రచయితలు కవిగా, యుగకర్తగా, కథకునిగా, రేడియో నాటికా కర్తగా, అనువాదకునిగా, విమర్శకునిగా, విప్లవ పథ నిర్దేశకునిగా, వ్యక్తిగా శ్రీ శ్రీ సమగ్ర పరిశీలన చేయడంలో మాకు యిప్పటి నుండే సహకరించ వలసిందిగా కోరుతున్నాము.

వివరాలకు, ప్రత్యుత్తరాలకు: వరవరరావు, చందా కాంతయ్య మెమోరియల్ కాలెజ్, వరంగల్-2. ఆంధ్ర ప్రదేశ్.

## పరిచయాలు:

మాయానంద్ మిశ్ర: సహర్ష కాలెజ్, సహర్ష(బీహార్)లో మైథిలీ లెక్చరర్. 1960లో 'అభివ్యంజన' అనే మాసపత్రిక పా్రరంభించి ప్రయోగవాద, ఆధునిక (నయీ) కవితలు రాయడం సాగించారు. మైథిలీ ఆధునిక కవుల్లో మాయానంద్ మిశ్ర, రాజకమల్ చౌదరీ, సోమదేవ్‌లకు ప్రత్యేక స్థానం వుంది. (కవితానువాదం, కవి పరిచయం డాక్టర్ కేదార్‌నాథ్‌లాల్, రాజేంద్ర కాలెజ్, ఛపరా, బీహార్‌లో హిందీ ప్రొఫెసర్ సహాయంతో యివ్వడం జరిగింది.)

టి. వి. గోపాలకృష్ణన్: 1940 లో జన్మించారు. కేరళ ప్రభుత్వ ఆరోగ్య శాఖలో లెబొరేటరీ టెక్నీషియన్. 'స్నేహితన్' అనే మాసపత్రిక నిర్వహించారు. చిత్రకారుడుకూడ. 'దేవనర్తకి' అనే కథా కావ్యం, రెండు నవలలు, ఒక డ్రామా, రెండు కవితా సంకలనాలు, ఒక ఆపెరా అచ్చవుతున్నవి.

శ్రీ హరీశ్ వాస్వాణి: 1939 లో బెలూచిస్తాన్ రాతాయీ గ్రామంలో జన్మించారు. సింధీ యువకథకుడు, కవి, విమర్శకుడు, కొంత కాలం టైమ్స్ ఆఫ్ యిండియాలో ఉద్యోగం. ప్రస్తుతం ఆదిపూరు (కచ్చి) తొలాణి ఫౌండేషన్ ఆర్ట్స్ కాలెజ్‌లో లెక్చరర్. వీరి కవితలు హిందీ, గుజరాతీ, ఇంగ్లీషు, పంజాబీ, బెంగాలీ భాషల్లోకి అనువదింపబడ్డాయి. వీరు తెలుగునించి కొన్ని కవితలు ప్రస్తుతం అనువదిస్తున్నారు.

వ్రజనాథరథో: దేశంలో ఇతర భాషలలో లాగానే ఒడియా యువతరం కవితలో కూడా కొత్త కొత్త విప్లవాత్మక ప్రయోగాలు జరుగుతున్నాయి. గురుప్రసాదమహంతి, సీతాకాంతమహాపాత్రో, రమాకాంతరథో, అనంతపట్నాయక్, దీపకమిశ్రా, భానుజీరావు, సారిహారమిశ్రా, వ్రజనాథరథో, సౌభాగ్యకుమారమిశ్రా, హరప్రసాదదాసు, దేవదాసఛోటరాయ్ మొదలైనవారు ఈ యువతరానికి చెందినవారు. బాలేశ్వరంలో 'నక్షత్రగోష్ఠి' రచయితలు 'సాంప్రతిక' అని వొక పత్రిక కూడ ప్రకటిస్తున్నారు.

"అన్ని విషయాలలోను కట్టుబాట్లు లేకుండా వుండడం మాకు ఇష్టం. సాహిత్యంలో జడత్వాం పారదోలడం మా ధ్యేయం" అంటారు వీరు.

నవకాంత బారువా: గౌహతీ (అస్సాం) కాటన్ కాలెజ్‌లో లెక్చరర్. కేంద్ర సాహిత్య ఎకాడమీ సభ్యులు. హేఅరణ్య, హేమహానగర్ (కవితా సంకలనం) కపిలీ

పరీయాసాధు (నవల) శిమారీ పాలేగై రతన్‌ప్పక్ (పిల్లల రచన) అచ్చయినరచనలు. ప్రసిద్ధ అస్సామీకవి, నవలాకర్త.

కామతాప్రసాద్ ఓఝూ 'దివ్య': సహర్‌ష్పూర్, ఆరాజిల్లా, బీహార్‌లో '37లో జననం. రైల్వేలో ఉద్యోగం. భోజపురీ భాషలో కథలు, కవితలు రాసారు. రానున్న కథా సంకలనం చిటుకీభరీ సెనుర్ (చిటికెడు సింధూరం) ఆధునిక సమాజ వ్యవస్థలో స్పష్టమైన దృక్పధంలేక జరుగుతున్నమార్పు యెడల తీవ్రమైన అధిక్షేపణ వీరిలో కనిపిస్తుంది. అనేక తెలుగు కవితల్ని హిందీలోకి తర్జుమా చేశారు.

మీశా, తారాసింగ్: పంజాబీ 'నయీకవిత' '55 లో పుట్టింది. దీని మీద ఇంగ్లీషు, హిందీ కవితల ప్రభావంలేదు. వీరిద్దరు ప్రముఖ 'నయీ' కవులు. మీశా కవితలో గద్యలయ, నవకొత్త ఉపమానాలు. తారాసింగ్ కవితలో అర్థం సాంకేతికంగా వ్యంజింప బడడం చూస్తాము.

'ఐ' ఇంకా పాతికేళ్లు నిండని తెలుగు యువకవి. కథలు, విమర్శలుకూడా రాస్తారు. లింగ్విస్టిక్స్‌లో రిసెర్చ్‌చేస్తున్నారు. ఉత్తమ ఆధునిక చిత్రకారుడు. వీరి కవిత ఒకటి సృజన '67 నవంబర్ సంచికలో కూడ వచ్చింది.

హరినారాయణ్ వ్యాస్: నయీ కవితశాఖకు చెందినకవి. 'తార్‌సప్తక్' రెండో సంపుటంలో వున్న కవులలో ఒకరు.

జగదీశ్ చతుర్వేది: 'అకవిత' పత్రికకు సంపాదకులు. ఢిల్లీలో కేంద్ర విద్యా శాఖలో ఉద్యోగం. అకవిత ఉద్యమాన్ని ప్రారంభించినవారిలో ప్రముఖుడు.

వినాయక్ గోవింద్ కరండికర్: స్వేదగంగ, మృద్గంధ-రెండూ వీరి ప్రసిద్ధ కవితా సంకలనాలు. ధృపద్—వీరి ఇటీవలి కవితా సంకలనం. అరిస్టాటిల్ పొయెటిక్స్, గెటె-ఫాస్ట్ మరాఠీలోకి అనువదించారు సాహిత్య విమర్శ, వ్యాసాలు, పిల్లల పుస్తకములు ప్రచురించారు. బొంబాయిలో ఎస్. ఐ. యి. ఎస్. కాలెజ్‌లో యింగ్లీషు ప్రొఫెసర్.

'షాద్': వరంగల్ నివాసం. సుప్రసిద్ధ ఉర్దూకవి. హిందీ తెలుగులో కూడ రాస్తారు.

అమీఖ్ హన్ఫీ: ఆలిండియా రేడియో, ఇండోర్‌లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్. ఆధునిక ఉర్దూ కవుల్లో ప్రయోగ శీలత్వానికీ శిల్పానికీ ప్రసిద్ధుడు. సంగ్‌పై రహా (1958) ఇంతెఖాబ్ ('65) సింద్‌బాద్ ('66) ప్రచురిత కావ్యాలు.

క్రా నా సుబ్రిమణ్యమ్: తమిళంలో ఎన్నో కవితలు, కథలు, నవలలు విమర్శలు రాసారు, ఆధునిక ఇంగ్లీషు, యూరోపియన్, అమెరికన్ సాహిత్యాలతో మంచి పరిచయం. ఎడిటర్‌గా సుప్రసిద్ధుడు.

మహజూర్: మూడు దశాబ్దాలపాటు కాశ్మీరీ సాహిత్య రంగంపై గొప్ప ప్రభావాన్ని వేసాడు. సంప్రదాయ బద్ధమైన పదజాలం, కవి సమయాలు, భావ చిత్రణ నుంచి దూరం కానట్టే కనిపించినా ఆయన సాహసికమైన కవితా వస్తువులు, ఆధునికమైన మనస్విత కాశ్మీరీ కవితలో కొత్త శకాన్ని ఆరంభించాయి.

కేకి ఎన్. దరువాలా: ఎక్కువగా పంజాబ్, ఉత్తర ప్రదేశ్‌లలో గడిపారు ఇండియన్ పోలీస్ సర్వీస్‌లో '58 లో చేరారు. ఆయన కవితలు Quest లో Voices International (U. S. A.) లలో వచ్చాయి.

వి. సీతారామయ్య: వివరాలు తెలియవు.

సుందరం: ఆధునిక గుజరాతీ కవుల్లో ప్రముఖులు. వీరి రచనల్లో ప్రిమిటివ్ ఫోర్స్, ఆవేగం చూస్తాము. వీరిపై మార్క్సిజం, గాంధీజీ, అరవిందుల ప్రభావాలు క్రమంగా పడ్డాయి. ప్రస్తుతం అరవిందాశ్రమం (పాండిచ్చేరీ) లో ఉంటున్నారు. కోయా భగవాన్ కడవ, వాణీ, వసుధా, యాత్రా వీరి ప్రసిద్ధ రచనలు.

దేవీరాయ్: 1962లో బెంగాలీలో 'ఆకలితరం' అన్న పేరుతో ఒక ఉద్యమం బయలుదేరింది. 1964లో ఈ కవులపై, రచయితలపై 'అశ్లీలం, సంఘాన్ని కూలదోసే చర్య' అన్న ఆరోపణపై కలకత్తా మెజస్ట్రేట్ కోర్టులో ఓ కేసు నడిచింది. అందువల్ల వీరి ఐదుగురి ఉద్యోగాలు కూడ ఊడాయి. దేశ విదేశ మేధావివర్గం గవర్నమెంటుకి చేసిన విజ్ఞప్తుల్ని పురస్కరించుకొని, ఒక కవికి మాత్రం జరిమాన విధించి, మిగతా వాళ్లని విడుదల చేశారు. వారికి మళ్లా ఉద్యోగాలు లభించాయి. ఆ ఐదుగురు కవుల్లో శ్రీ దేవీరాయ్ ఒకరు.

'నేను నాగురించే, నా అనుభూతే రాసుకుంటాను.... దెబ్బతిన్న కవిని.... కళ జీవితాన్ని అనుసరిస్తుంది— కవిత నా భార్య— గర్భవతి — గర్భంమీద చెవి పెట్టి కడుపులో ఉన్న నాకొడుకు హృదయస్పందన వింటాను'. అంటాడు దేవీరాయ్.

ఈ తరానికి జీవితం, సాహిత్యం వేరువేరుకావు, అనుభవించిందే రాస్తారు. రచనల్ని చదివినమీద ఈ రచయితలు ఎట్లా బ్రతుకుతున్నది సులువుగా వూహించుకోవచ్చును,

వయస్సు 30 ఏళ్లు.

రచనలు: సభ్యతార్ ప్రథమ్ ఛీత్కార్ కవి, ఉపనరక్,

ఏకాంకిక—కొన్ని కవితలు. ఆదిలో ఆకలితరం పత్రికకి సహ సంపాదకులు.

డాక్టర్ ప్రభాకర్ మాచవే : ఒక్క నాటక ప్రక్రియ మినహా అన్ని సాహిత్యప్రక్రియల్ని సమృద్ధి చేశారు. హిందీ 'నయీ కవితోద్యమం' లో ప్రముఖపాత్ర. ప్రథమ 'తార సప్తక్'లో వీరి కవితలు చేర్చబడ్డాయి– 'స్వప్న భంగ్', 'అనుస్వాత్', 'తేల్ కీ పకౌడియాఁ', 'రేలంపేల్' వీరి కొన్ని కవితా సంకలనాలు. అమెరికా నీగ్రోల్ని. భారతీయ హరిజనుల్ని పాత్రలుగా తీసుకొని వ్రాసిన వీరి నవల "జో" వీరికి విశేషఖ్యాతి తెచ్చిపెట్టింది. ప్రస్తుతం యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో స్పెషల్ ఆఫీసర్.

ఎం. టి. వాసుదేవన్ నాయర్ : 1956 నుంచి మలయాళ పత్రికల్లో పని చేస్తున్నారు. రెండు దశాబ్దాలుగా వీరి పన్నెండు కథా సంపుటాలు, ఐదు నవలలు వెలువడినవి. దాదాపు అన్ని భారతీయ భాషల్లోకి వీరి కథలు అనువదింపబడినవి. కొన్ని కథలు మలయాళంలో సినిమాలుగా కూడ తీయబడి విశేష ప్రజాదరణ పొందినవి.

## అనువాదకులు:

1. నిర్మలానంద : ఝర్సుగూడా ఒరిస్సాలో రైల్వేలో ఉద్యోగం. తెలుగు సాహిత్య ప్రచార సమితిని నిర్వహిస్తూ హిందీ కిటికీలోనుంచి ఒకభాషవాళ్లు ఇంకో భాషవాళ్ళతో మనసిచ్చి మాట్లాడుకునే అవకాశాలకోసం ప్రయత్నిస్తున్నారు. యువకుడు. ఇందులోని చాలా కవితలు హిందీనుంచి అనువదించారు.

2. పురిపండా అప్పలస్వామి : ఈ సంవత్సరమే ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని పొందారు. ఆధునిక, అభ్యుదయ కవితా ఉద్యమాల్లో శ్రీ శ్రీ సహచరుడు. విశాఖ జిల్లా రచయితల సంఘంద్వారా సాహిత్య సేవ చేస్తున్నారు.

3. నిఖిలేశ్వర్ : దిగంబర కవుల్లో ఒకరు. హిందీ సాహిత్యంతో బాగా పరిచయం ఉన్నవారు. హిందీలోకూడ వీరిరచనలు, అనువాదాలు చాల పత్రికల్లో వచ్చాయి.

4. కాళోజి నారాయణరావు : సుప్రసిద్ధ తెలుగు "ప్రజాకవి". జీబ్రాన్ The Prophet ను ఇటీవలే తెలుగుచేశారు. ఉర్దూసాహిత్యంతో బాగా పరిచయంఉంది.

5. వేనరెడ్డి : వరంగల్ కాలెజ్‌లో తెలుగు లెక్చరర్. 'చేతనావర్తం' కవులలో ఒకరు.

6. వి. కె. గోకాక్ : బెంగళూరు యునివర్సిటీ వైస్ ఛాన్సలర్. సుప్రసిద్ధ కన్నడకవి, విమర్శకుడు, ఇంగ్లీషులో కవిగా, విమర్శకుడుగా, అనువాదకుడుగా సుప్రసిద్ధుడు.

Advt 1.

# ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ - తెలుగు ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | తెలుగు సామెతలు | ప్రధాన సంపాదకులు: | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | రు. 10-00 |
| 2. | పదబంధపారిజాతము రెండు సంపుటాలు | సంపాదకులు: | శ్రీ నార్ల వెంకటేశ్వరరావు | 20-00 |
| 3. | నన్నయపదప్రయోగకోశము | ,, | శ్రీ అబ్బూరి రామకృష్ణారావు | 40-00 |
| 4. | నన్నెచోడ ,, | ,, | డా॥ డి. వేంకటావధాని | 20-00 |
| 5. | శ్రీనాథ ,, | ,, | ఆచార్య కె. లక్ష్మీరంజనము | 30-00 |
| 6. | మాండలిక వృత్తిపదకోశము సంపుటి I (వ్యవసాయము) | | డా॥ బిఎచ్. కృష్ణమూర్తి | 25-00 |
| 7. | మాండలిక వృత్తిపదకోశము సంపుటి IV (వాస్తు) | | డా॥ బూదరాజురాధాకృష్ణ | 50-00 |
| 8. | ఆంధ్రప్రదేశ్ శాసనదర్శిని | | శ్రీ కె. ఈశ్వరదత్ | 32-00 |
| 9. | శ్రీమహాభాగవతము రెండు సంపుటలు | | సంపాదక సంఘము | 24-00 |
| 10. | దక్షిణభారత సాహిత్యములు | | | 3-00 |
| 11. | సాహిత్యోపన్యాసములు 1 నుండి 8 | | | 11-00 |
| 12. | ఆంధ్రప్రదేశ్ ప్రాచీన చారిత్రిక భూగోళము | | శ్రీ కె. ఈశ్వరదత్ | 10-00 |
| 13. | సూక్తి సుధాకరము | ,, | శ్రీ పి. సత్యనారాయణరాజు | 20-00 |
| 14. | ఉర్దూకథానికలు | తెలుగుఅనువాదము | శ్రీ బి. చంద్రమౌళిశాస్త్రి | 5-00 |
| 15. | ఉర్దూ సాహిత్య చరిత్ర | ,, | శ్రీ ఎస్. సదాశివ | |
| 16. | సి. పి. బ్రౌన్ జీవితము | రచయిత | శ్రీ కె. వీరభద్రరావు | 5-00 |
| 17. | శతక సప్తకము(సంస్కృతము) | అనువాదం | శ్రీ వరదాచార్యులు | 1-50 |
| 18. | సూరదాసు పదాలు | ,, | శ్రీ దుర్గానంద్ | 1-00 |
| 19. | రాఘవాభ్యుదయము | సంపాదకులు | డాక్టర్ బి. రామరాజు | 4-00 |
| 20. | రసగంగాధరము | తెలుగు వ్యాఖ్యానము | శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్య | 6-00 |
| 21. | సుమతి వేమన శతకాలు | (సంస్కృతము) | శ్రీ ఎస్.టి.జి. వరదాచార్యులు | 1-00 |
| 22. | అఖిలభారత కవయిత్రులు | సంపాదకురాలు | శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 7-00 |
| 23. | ఉత్తరభారత సాహిత్యములు | | | 4-50 |

| | | | |
|---|---|---|---|
| 21. విష్ణు పారిజాతము | | తరిగొండ వెంగమాంబ | 2-50 |
| 25. ఉత్తర రామచరిత్ర | వ్యాఖ్యానము | శ్రీ ఎస్. రామదాసయ్యంగార్ | 8-00 |
| 26. ఆంధ్రదేశ హాస్యకథలు | (సంస్కృతము) | శ్రీ ఎస్. సూర్యనారాయణశాస్త్రి | 0-75 |
| 27. కళాపూర్ణోదయము | ,, | ,, | 6-00 |
| 28. నెహ్రూ సవనీర్ | | | 8-00 |
| 29. టాగోర్ సవనీర్ | సంపాదకులు | శ్రీ ఆచంట జానకీరామ్ | 10-00 |
| 30. ఆంధ్ర గద్య చంద్రిక | | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 8-00 |
| 31. ఆంధ్ర క్రియా స్వరూప మణిదీపిక | ,, | ,, | 20-00 |
| 32. మౌలానారుమీమస్నవీ | (అనువాదము) | శ్రీ ఎస్. సదాశివ | 2-00 |
| 33. తెలుగు నుండి తెలుగు శబ్దకోశము విద్యార్థుల కొరకు | | | 5-00 |
| 34. వేమన పద్యాలు (బ్రౌన్ వేమన పద్యాలు) | | | 4-00 |
| 35 ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచిక | సంపాదకురాలు | శ్రీమతి కె. రామలక్ష్మి | 2-00 |
| 38. ఘటికాచల మహాత్మ్యము | సంపాదకులు | శ్రీ కె. రామకోటిశాస్త్రి | 4- |
| 37. కథామందరము | సంపాదకురాలు | శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 3- |

---

